శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# సాంప్రదాయిక వ్యాస మాలిక – 9

(శ్రీమదణ్ణంగరాచార్యస్వామి వ్యాసమాలిక ఆధారంగా)



పార్థసారథి పెరుమాళ్, తిరువళిక్కేణి



'పండితరత్న' డా॥ ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి అహ్మగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు




కాంచీ మహావిద్వాన్, ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్య స్వామివారు

# విషయ సూచిక

# భగవద్రామానుజ దర్శనంలో సర్వం సత్యం

భగవద్రామానుజులు ఈ లోకంలో అవతరించి, శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యులు అని, ఉభయవేదాంత ప్రవర్తకాచార్యులు అని తాము బిరుదు వహించడమే కాక, తమను ఆశ్రయించినవారిని కూడా ఆ బిరుదు వహించేటట్లు చేశారు— అనేది సుప్రసిద్ధం. ఆ మహాచార్యులు ఇతర మతస్థులచేత చెప్పబడిన పలు పలు అపార్థాలను నిరసించి, సదర్థాలను ప్రతిష్ఠితం చేశారు— అనేది కూడా ప్రసిద్ధం. ఈ విధంగా వారు సుప్రతిష్ఠితం చేసిన సదర్థాలలో చాలా ముఖ్యమైన ఒక అర్థం ఇక్కడ ప్రస్తావించబడుతున్నది.

మాయావాదులు అనబడే ఇతర మతస్తులు బ్రహ్మం ఒక్కటే సత్యం అని, మిగిలిన చేతనా చేతనాత్మకమైన ప్రపంచం అంతా అసత్యమని సిద్ధాంతం చేసి చెబుతున్నారు. వ్యావహారిక దశ అని, పారమార్థిక దశ అని రెండు దశలను వారు అంగీకరించి, వ్యావహారిక దశలో పరబ్రహ్మ కంటే వేరుగా ఉండే చేతనాచేతనాలు ఉన్నట్లుగా తోచినప్పటికీ, ఇటువంటి భేదానుసంధానం ఉండే అవకాశం పూర్తిగా లేదు— అని అంటున్నారు. వారి మతప్రక్రియను సంగ్రహంగా చెబితే, అది ఇంత మాత్రమే. నిర్విశేష చిన్మాత్రం బ్రహ్మం అనేది వారు చెప్పే సూత్రం వంటి ఒక మాట. " సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" అని ఉపనిషత్ చెబుతున్నందున, ఆ పరబ్రహ్మం జ్ఞానమాత్రస్వరూపం. అది స్వయంప్రకాశమైన స్వభావాన్ని కలిగినది అయినా, తన అనాది అయిన అవిద్యవల్ల అపరమార్థమైన జ్ఞాతృజ్ఞేయాదిభేదాన్ని అనుసంధిస్తున్నది. (తనలో ఏర్పరుచుకుంటున్నది). వస్తుతః జ్ఞాతృజ్ఞాయాదిరూపాలైన అనేక విధాలైన వస్తువులు లేకపోయినాప్పటికీ, అవి ఉన్నట్లుగా బ్రాంతిని పొందుతున్నది. అవిద్యాపరిణామభూతుడైన జీవాత్మ "త్త్వమసి" అనే మొదలైన వాక్యాలవల్ల కలిగే జ్ఞానం ద్వారా అద్వైత విద్యను పొందినవాడై, ఆ పరబ్రహ్మ యొక్క భ్రమను పోగొడుతున్నాడు. అంటే, "త్త్వమసి శ్వేతకేతో!" అనే వేదాంత వాక్యంలోని యథార్థమైన అద్వైతం ఎప్పుడు జీవాత్మకు జ్ఞానగోచరం

అవుతున్నదో, అప్పుడే బంధమోక్షం— అని భావం. అందుచేత, కంటికి కనిపించేది అంత అసత్యం—అనేదే మాయావాదుల సిద్ధాంత సారం.

ఈ వాదాన్ని లఘువుగా ఖండించే మార్గం ఒకటి ఉన్నది. అది ఏమంటే, అంతా అసత్యం అని పలికేవారిని ఉద్దేశించి ఒకటి అడగాలి. "అంతా అసత్యం కానివ్వండి. "సర్వం మిథ్యా" అనే ఈ ప్రతీతి అనేది సత్యమేనా చెప్పండి"— అని అడగాలి. "సత్యమే" అని వారు సమాధానం చెప్పేవారైతే, సర్వపదార్థాలలో చేరిన ఈ ప్రతీతి అనేది వాస్తవం అని అంగీకరిస్తున్నందున, వారు చెప్పే సర్వమిథ్యాత్వ ప్రతిజ్ఞ వ్యర్థమే అవుతుంది. ఈ ప్రమాదం నుండి వారు తప్పించుకోవాలని అనుకొంటే, సర్వం మిథ్యా అనే ఈ ప్రతీది కూడా అసత్యం అని వారు చెప్పాలి. ఆ విధంగా చెబితే, తమ వాదాన్ని తామే అసత్యం అని చెప్పి, అంగీకరించినట్లుగా అవుతుంది. అంతా సత్యం అని వారు అంగీకరించినట్లుగా పర్యవసిస్తుంది. . ఇది మాయావాదులను సులభంగా ఖండించే దారి. శ్రీభాష్యంలో ఈ దారే చూపబడినది, వేరు మార్గాలలో చూపబడే ఖండన ప్రకారాన్ని కూడా కొంచెం తెలియజేస్తాను.

ఛాందోగ్యపనిషత్తులో (1—2—1) "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవ అద్వితీయమ్" అని అధ్యయనం చేయబడుతున్నది. బ్రహ్మ ఒకటే సత్యమైనదని, మిగిలిన వస్తువులన్నీ అసత్యమని చెప్పే అద్వైతవాదులు ఈ ఉపనిషద్వాక్యాన్ని ముఖ్యప్రమాణంగా చూపుతున్నారు. ఇందులో ఉండే "అద్వితీయమ్" అనే ఒక పదం ముఖ్యమైనదిగా చెప్పబడుతున్నది. "బ్రహ్మం ఒకటే ఉన్నది, మరేమీ లేదు"— అని ఈ పదం ద్వారా వ్యక్తం అవుతున్నది— అని అద్వైతులు అంటారు "బ్రహ్మ సత్యమే, మిగిలిన వస్తువులు కూడా సత్యమే" అని భావించే మనవారు దీనికి ఏమి అర్థం చెబుతున్నారు?— అనే విషయాన్ని ఇక్కడ సంగ్రహంగా తెలియజేస్తాను.

సార్వభౌముడైన ఒక మహారాజును ఉద్దేశించి "ఇతడు అద్వితీయుడైన ప్రభువు "అని చెప్పినట్లయితే, " అతనికి ప్రజలు లేరు, భార్య లేదు, కట్టుకునే గుడ్డ లేదు, నిలిచే నీడ లేదు, తినడానికి తిండి లేదు" అని చెప్పినట్లు అవుతుందా? "ప్రభువు అద్వితీయుడు" అంటే, "అతడు రెండవ వస్తువును దేనిని కలిగినవాడు కాడు" అని అర్థం వస్తున్నందున, ఈ విధంగానే అర్థాన్ని గ్రహించాలి– అని అంటే, దీనిని లోకంలో ఎవ్వరూ ఒప్పుకోరు కదా. "ఈ ప్రభువునకు సాటి వచ్చే వేరొకడు లేడు"– అని అర్థం వస్తుంది తప్ప, ఇతడు తప్ప లోకంలో వేరొక వస్తువేమి లేదు– అని అర్థం కాదు– అనే విషయాన్ని అందరూ ఏకకంఠంగా అంగీకరించి తీరుతారు. లోకానుభవసాక్షికమైన ఈ అర్థమే "ఏకమేవ అద్వితీయమ్" అనే చోట కూడా పొసగుతుంది. "పతిం విశ్వస్య"అని వేదాంతాలలో భగవంతుడు కీర్తింపబడుతున్నాడు. "పాలింపబడే వస్తువు ఏది లేదు"– అని నిర్ణయించి, "ఈశ్వరుడు మాత్రం ఉన్నాడు"– అని అంటే, అజాగళస్తనానికి, అతనికి ఏ విధమైన తేడా ఉండదు కదా. భగవంతుని దూషించినట్లే కదా, ఈ అర్థం పర్యవసిస్తుంది.

ఉపనిషత్తుల యథార్థమైన అర్థాన్ని తెలిసికొన్నవారిలో అగ్రేసరులైన భగవద్రామానుజులు "భగవంతుని సార్వభౌముడని అనేటప్పుడు సర్వం యథార్థమై తీరాలి"– అని, "ఆ విధంగా ఉంటే తప్ప సార్వభౌమత్వం భగవంతునకు పొగడ్త కాబోదు"– అని తెలియజేసి, సర్వపదార్థాలను సత్యంగా గ్రహించి, వాటిని భగవంతునకు విభూతిగా శ్రీరామానుజులు నిర్ణయించి నిరూపించారు.

# శాస్త్రార్థతత్త్వసమన్వయం

తిరువాయ్ మొழி ఈడు వ్యాఖ్యానం (5 –7– 3) " కరుడ ప్పుట్కొడి శక్కర ప్పడై" అనే వానమామలై దశకంలోని పాశురానికి నంబిళ్ళై అవతారిక ఈ విధంగా ఉన్నది.

"ఆళ్వార్లూ! మీరు, అనుగ్రహించు– అని అంటున్నారే! ఆ విధంగానే మిమ్ములను అనుగ్రహిస్తాము. అందులో ఏ ఆటంకం లేదు. అయినా, " శాస్త్ర ఫలం ప్రయోక్తరి"(ఆత్మ కర్త అయినప్పుడే శాస్త్రం ప్రయోజనం కలిగినది అవుతుంది)" కర్తా శాస్త్రార్థవత్వాత్" (శాస్త్రం ప్రయోజనం కలిగినది కావాలంటే, ఆత్మ కర్త కావాలి) అని ఉన్నది కదా! అనుగ్రహాన్ని పొందేవారి వైపునుండి కూడా ఏద్దైనా కొంచెం ప్రయత్నం ఉండాలి కదా– అని భగవంతుడు అనగా, " ఇది నీవు ఇప్పుడు కల్పించిన మర్యాదా? లేక, ఇంతకుముందే ఉన్నదా? ఇంతకుముందు నా దగ్గర ఏమీ లేకుండానే అనుగ్రహించావు కదా. అందుచేత, నా విషయంలో ఏద్దైనా ఒక ప్రయత్నాన్ని చూచి, అనుగ్రహిస్తానని అనడం మానివేసి, నీ కేవలకృపతోనే నన్ను అనుగ్రహించాలి– అని ఆళ్వారులు అంటున్నారు, ఇంతవరకు నీవు నిర్హేతుకంగానే నన్ను అనుగ్రహించినట్లే, తరువాత ఇకపై కూడా ఆ విధంగానే నిర్హేతుకంగానే అనుగ్రహించాలి –అని ఆళ్వార్లు అంటున్నారు. (ఇది ఈడు వ్యాఖ్యానంలోని అవతారిక)

ఇక్కడ భగవంతుని వాదం ఒక విధంగాను, ఆళ్వారుల ప్రతివాదం ఇంకొక విధంగానూ ఉన్నది. భగవంతుని వాదం ఏమి? అంటే, ఫలాన్ని పొందాలని కోరేవారు ఏదో ఒక ప్రయత్నం చేయకుండా, ఊరికే ఫలాన్ని పొందడం సాధ్యం కాదు. ఫలాన్ని పొందడానికి తగిన మార్గాలను, అంటే, సాధనాలను నేను శాస్త్రాలలో బహుముఖంగా తెలియజేశాను. వాటిని అనుష్ఠిస్తే ప్రాప్యాన్ని పొందడం సాధ్యం అవుతుంది తప్ప, ఊరికే ఫలాన్ని పొందడం సాధ్యం కాదు. ఆ విధంగా పొందడం జరిగితే, సర్వముక్తిప్రసంగం వస్తుంది, శాస్త్రార్థాలు కూడా కలతను పొందుతాయి. ఆ విధంగా అవి నిష్ఫలం కాకుండా

ఉండడం కోసం నేను ఒక చక్కని క్రమాన్ని ఏర్పాటు చేశాను. దానిని మీరు దాటకూడదు. దానిని పరిపాలనం చేసినవారికి తప్ప మిగిలినవారికి ప్రాప్యం లభించదు.

ఇది భగవంతుని వాదం. ఇందులో ఏ విధమైన కొరతను చెప్పడానికి వీలు లేదు. "మయర్వఱ మదినలమ్" అనే విధంగా భక్తి రూపాపన్నమైన, ఏ విధమైన భ్రాంతి, విస్మృతి లేని జ్ఞానాన్ని పొందినవారైన ఆళ్వారులకు ఈ విషయం తెలియనిది కూడా కాదు. " వణక్కుడై త్తవనెఱి వழிనిన్ఱు పుఱనెఱి కళైకట్టి ఉణక్కుమిన్ పశై యఱ అవనుడై ఉణర్వు కొండు ఉణర్ న్దే" (తిరువాయ్ మొழி– 1 –3– 5) (భక్తి మార్గంలో ప్రవర్తించి, దానికి విరోధి అయిన శబ్దాదివిషయాలలో సంచరించే మార్గాలను నిరోధించి, వాసనారూపమైన రుచిని పోగొట్టుకొనండి. భగవంతుని విషయంలో భక్తిరూపాన్ని పొందిన జ్ఞానంతో ఆ స్వామిని దర్శించండి) అని మొదలైన పాశురాలలో ఈ విషయాన్ని వ్యక్తం చేశారు. అయితే, ఇక్కడ భగవంతునితో ఆళ్వార్లు చేసే ప్రతివాదం ఏమి? అని అంటే,

మాకు నీవు కరణకలేబర ప్రధానాన్ని చేసి, మమ్ములను నీవు సృష్టించినది మేము ప్రార్థించినందువల్లనా? కాదు కదా. నీ నిర్హేతుకమైన కృపతోనే కదా దానిని చేశావు. ఇందువల్ల సంసారుల విషయంలో నీకు ఒక నిర్హేతుకమైన కృప ఉన్నది– అని తెలుస్తున్నది. ఆ కృప నిత్యశ్రీః హి నిత్య మంగళంగా ఎల్లప్పుడూ వెలుగుతున్నదే తప్ప, ఒక సమయంలో ఉండి ఇంకొక సమయంలో లేకుండా పోయేది కాదు కదా. ఆ కృపతోనే నీవు నాకు పరమపురుషార్థాన్ని కూడా అనుగ్రహించడంలో ఏమి అడ్డు ఉన్నది? మొదట మానుండి ఏ ప్రయత్నాన్ని ఎదురు చూడకుండా కార్యం చేసిన నీవు, ఇప్పుడు మాత్రం ప్రాప్యాన్ని పొందడానికి మా దగ్గర నుండి ఒక ప్రయత్నం కావాలని అనడం యుక్తమేనా ? –అనేది ఆళ్వార్ల ప్రతివాదం.

ఆళ్వార్లు చేసే ఈ ప్రతివాదం యుక్తమేనా? అని విమర్శించి చూడాలి. ప్రారంభంలో భగవానుడు మనకు కరణకలేబర ప్రదానం చేయడం తన నిర్హేతుక కృపవల్లనే. అయినప్పటికీ, కరణకళేబరాలను ఇచ్చి, శాస్త్రార్థాలను అనుగ్రహించి, వాటిలో తనను పొందడానికి తగిన సాధనాలను తెలియజేసి, ఆ దారిలో తనను ఆశ్రయించినవారికి ప్రాప్యాన్ని అనుగ్రహిస్తాని తాను వ్యక్తం చేసి ఉండగా, ఈ విషయాన్ని తెలిసినవారే దారి కాని దారిలో ప్రతివాదం చేయడం యుక్తం కాదు. అందుచేతనే, ఆళ్వార్లు చేసే ప్రతివాదం యుక్తం కాదు— అని భావించరాదు. ఈ ప్రతివాదం అయుక్తమే— అని నిర్ణయం చేయకూడదుకూడా.

మరి, ఆళ్వారుల అంతరంగం ఏమి? అంటే, ప్రాప్యంలోని గొప్పతనాన్ని, మనం చేసే సాధనానుష్ఠానంలోని నైచ్యాన్ని జాగ్రత్తగా పరిశీలించి చూసినప్పుడు, ఎటువంటి గొప్ప ప్రయత్నాన్ని అయినా గొప్పదైన ప్రాప్యానికి తగిన సాధనంగా మనం భావించకూడదు. దానికి తగిన సాధనం లోకంలో దొరకనే దొరకదు. సర్వశక్తి అయిన శరణ్యుడు దీనిని ఒక వ్యాజంగా గ్రహించి అనుగ్రహిస్తున్నాడు— అని మనం భావించాలి తప్ప, దీనిని తగిన సాధనంగా గ్రహించి, ఫలాన్ని అనుగ్రహిస్తున్నాడు— అని భావించడం తగనే తగదు. అందుచేత, "నిర్హేతుకంగా అనుగ్రహించు" అని ప్రార్థించడమే యుక్తం అయినది— అని భావించి, ఆ విధంగా ఆళ్వార్లు పలుకుతున్నారు.

అందువల్ల ఆళ్వార్ల ప్రతివాదం యుక్తమైనదే.

# శ్రీమణవాళ మహామునుల దివ్యసూక్తి

లోకంలో మాట్లాడిన మాట అంతా మాట కాదు. రాసిన రాత అంతా రాత కాదు. భట్టర్ శ్రీగుణరత్నకోశంలో " అనాఘ్రాతావద్యం బహువిధపరీణాహి" అని ఆరంభించి, ఐదు విశేషణాలు ఉపయోగించి, వాగ్విలసితం ఏ విధంగా ఉండాలో తెలియజేశారు. ఇటువంటి వాగ్విలసితం మణవాళ మహామునులకే ఉన్నది.

"పదానాం సౌభ్రాత్రా దనిమిషనిషేవ్యం శ్రవణయోః" అని అంటూ ఆ శ్లోకంలో భట్టర్ అనుగ్రహించిన అతిశయం శ్రీమణవాళ మహామునుల దివ్యసూక్తిలో తప్ప, వేరెక్కడా దర్శించటానికి వీలు కాదు. "పదాల పొందిక"– అనేది ఒకటున్నది చూశారా!, అది ఇంకొకరి వ్యాఖ్యానాలలో సాధారణంగానే ఉంటుంది. కానీ, మణవాళ మహామునుల వ్యాఖ్యానాలలో అది అత్యాశ్చర్యకరం, అత్యద్భుతం, అన్యాదృశం– అని చెప్పదగినదిగా ప్రకాశిస్తుంది. దీనిని తెలిసికోవడం అందరికీ సులభం కాదు. మురారి అనే ఒక మహాకవి "అబ్ధిః లంఘిత ఏవ వానరభటైః కింత్వస్య గంభీతామ్ ఆపాతాళ నిమగ్నపీవరతనుః జానాతి మంథాచలః (వానరవీరులు సముద్రాన్ని దాటారు, కానీ, ఆ సముద్రంలోని లోతును తెలిసికొనగలిగినది కేవలం మందర పర్వతం మాత్రమే) అని అంటాడు. వానరవీరులు సముద్రాన్ని దాటినవారే అయినా, ఆ సముద్రం పై పైననే సంచరించిన వారికి సముద్రంలోని లోతు కొంచెం కూడా తెలియదని, మందర పర్వతం ఒకటే దానిని తెలియగలిగినది– అని ఈ శ్లోకంలో చెప్పబడినట్లే, సారస్వతాబ్ధిసారాన్ని, దాని లోపల ప్రవేశించి, మర్మస్పర్శిగా అందులోని లోతును తెలియగలిగినవారు ఎవరంటే, సముద్రం చుట్టూ ఉండే ఈ లోకంలో మణవాళ మహామునులు ఒక్కరే– అని వారి దివ్యసూక్తిలో గాఢంగా అవగాహించినవారు అంటారు.

అసూయవల్ల, ద్వేషంవల్ల పలువురు వారి సూక్తిసుధాసముద్రంలో అవగాహహించలేకపోవచ్చు. అందులో అవగాహించే భాగ్యం పొందినవారిలో కూడా, పలువురు మణిప్రవాళ శ్రీసూక్తియే కదా! అని సామాన్యంగా భావించి, పైపైన చూచి

వదిలిపెడతారు. "తేనావలోక్య కృతినః పరిభుంజతే తమ్" అని భట్టర్ అనుగ్రహించినట్లుగా, వారి శ్రీసూక్తి సుధాసాగరానుభవభాగ్యపరీపాకం కలవారు ఎవరో కొందరు అదృష్టవంతులు అయినవారు మాత్రమే ఉంటారు.

మణవాళ మహాముసుల దివ్యగ్రంథాలలో తత్వత్రయ వ్యాఖ్యానం ఒకటి సేవిస్తే చాలు, సకలశాస్త్రార్థాలలోను, శ్రీభాష్యసుధానిధిలోను లోతుగా అవగాహించిన మహాజ్ఞాననిధి వీరు తప్ప వేరెవ్వరూ లేరు— అని శపథం చేసి చెప్పవచ్చు. జ్ఞానం అనేది వేరు, వ్యుత్పత్తి అనేది వేరు. ఆ వ్యుత్పత్తి అనేది సకలగ్రంథాలలోనూ మణవాళ మహామునులకు చాలా అతిశయించి ఉన్నది. దీనిని నిరూపించడానికి వారి దివ్యసూక్తులలో పలు పలు సందర్భాలు ఉన్నప్పటికీ, ఒక్క సందర్భాన్ని మాత్రమే ఇక్కడ ప్రస్తావిస్తాను.

తత్వత్రయం అనే శ్రీపిళ్లైలోకాచార్యులవారు అనుగ్రహించిన గ్రంథంలోని ఈశ్వరప్రకరణంలోని "ఇదుక్కు ప్రయోజనమ్ కేవలలీలై" (82) (దీనికి ప్రయోజనం లీలమాత్రమే) అనే ఒక చూర్ణిక ఉన్నది. భగవంతుని జగత్సృష్టి అనే వ్యాపారానికి కేవలం లీల మాత్రమే ప్రయోజనం— అని దీని అర్థం. శ్రీభాష్యంలో కూడా "లోకవత్తు లీలాకైవల్యమ్" (171) అనే సూత్రంలోని భాష్యంలో "జగత్సర్గే లీలైవ కేవలప్రయోజనమ్" అని, " పరస్య బ్రహ్మణో లీలైవ ప్రయోజనమ్" అనే శ్రీసూక్తుల విన్యాసం ఉన్నది. ఇందులో ఏ విద్వాంసునకు కూడా ఏ విధమైన సందేహం, విచికిత్స సులభంగా తోచదు. అయితే. ఇక్కడ మణవాళ మహామునులు తమ ప్రజ్ఞావిశేషంతో విమర్శ చేసే రీతి లోతుగా గమనించి చూడదగినది.

లీల అంటే ఏమి? అని అడిగితే, దానికి అర్థం చెప్పాలి కదా. ఒక కార్యం చేసేటప్పుడు, తాత్కాలికంగా, అప్పుడే ఆ సమయంలోనే కలిగే ఒక మనోవికాసాన్ని తప్ప, తరువాత కాలంలో ఏ విధమైన ప్రయోజనాన్ని ఆశించకుండా చేసే వ్యాపారానికి

లీల అని పేరు. చిన్న కుర్రవాడు లీలను చేస్తున్నాడు— అని అంటే, ఆడుకోవడం— అనే ఒక వ్యాపారాన్ని చేస్తున్నాడు— అని కదా అర్థం వస్తుంది. అందుచేత, లీల అనేది ఒక వ్యాపారం— అని తేలింది. సృష్టికి లీల ప్రయోజనం— అని అంటే, ఈ వాక్యం సమన్వితం అవుతున్నదా? అని చూడాలి. సృష్టి ఒక వ్యాపారం. సృష్టి అనే వ్యాపారానికి లీల అనే వ్యాపారం ప్రయోజనం— అని అన్నట్లు ఇక్కడ తేలుతున్నది. "సృష్టి లీల" అని సమానాధికరణంగా చెప్పాలి తప్ప, "సృష్టికి లీల ప్రయోజనం" అని వ్యధికరణంగా వాక్యవిన్యాసం చేయడంలో సమన్వయం లేనట్లుగా కనబడుతున్నది కదా. శ్రీభాష్యకారులు, శ్రీపిళ్లైలోకాచార్యులవారు వ్యధికరణంగానే వాక్యవిన్యాసం చేయడాన్ని ఇంతకుముందే ఉదాహరించి చూపించడం జరిగింది. . ఇది ఏ విధంగా పొసగుతుంది? అనే సందేహం తోచడమే సామాన్యమైన జ్ఞానం కలవారికి అరుదు. తత్వత్రయ వ్యాఖ్యానంలో శ్రీ మణవాళ మహామునులు ఈ సందేహాన్ని ఒక విధంగా లేవనెత్తి, దానికి సమాధానాన్ని అనుగ్రహించే అందం ఎటువంటిదో, లోతయిన జ్ఞానం కలవారికే అవగాహహించటానికి సాధ్యం అవుతున్నది. ఇక్కడ ఉండే వారి శ్రీసూక్తులను గమనించండి.

"లీలయావదు తాదాత్వికరస మొఴియ కాలాంతరత్తిల్ వరువదొరు ఫలత్తై క్కణిశియామల్ పణ్ణుమ్ వ్యాపారమే యాకిలుమ్, "ఇదుక్కు ప్రయోజనమ్" ఎన్లు సృష్టిరూపవ్యాపారత్తుక్కు ప్రయోజనమ్ శొల్లుకైయాలే తాదాత్వికరసమాత్రత్తై శొల్లిఱ్ఱాక క్కడవదు" (సృష్టి అనేది తాత్కాలికంగా కలిగే ఆనందం తప్ప, కాలాంతరంలో వచ్చే ప్రయోజనాన్ని ఉద్దేశించకుండా చేసే వ్యాపారం అయినప్పటికీ, "దీనికి ప్రయోజనం" అని సృష్టిరూపమైన వ్యాపారానికి ప్రయోజనం అని చెప్పినందున, తాత్కాలికంగా కలిగే ఆనందాన్ని మాత్రం చెప్పినట్లు అవుతుంది) అనేది ఇక్కడ శ్రీమణవాళ మహామునుల అమృత వాక్కు.

ఇందులో "లీలై యావదు––– పణ్ణుమ్ వ్యాపారమే యాకిలుమ్" అనే వాక్యం చాలా గంభీరమైనది. " పణ్ణుమ్ వ్యాపార మాగైయాలే ఇదుక్కు ప్రయోజనమ్ కేవల లీలై ఎన్గిఱ మూలసూక్తి సమన్విత మాకమాట్లాదాకిలుమ్" అనేది ఇక్కడ వివక్షితమైనది. " అఖిలభువనజన్మస్థేమ భంగాదిలీలే" అని, "జగదుత్పత్తి స్థితిసంహారాంతః ప్రవేశ నియమనాది లీలమ్" అని సమానాధికరణంగానే పల్కిన శ్రీభాష్యకారులు కూడా "జగత్స్రుష్టౌ లీలైవ ప్రయోజనమ్" అని వ్యధికరణంగా పలికినందున, దానిని అనుసరించి శ్రీపిళ్ళైలోకాచార్యులవారు మూలంలో "ఇదుక్కు ప్రయోజనమ్ కేవలలీలై" అని పలికినప్పటికీ, ఇది కొంచెం సంస్కరించవలసిన శ్రీసూక్తి అవుతున్నది. "ఇదుక్కొరు ప్రయోజనమ్ ఇల్లై, ఇదు కేవలలీలైయే" అనే వాక్యసన్నివేశం ఉండాలి– అని భావించి, శ్రీమణవాళ మహామునులు దానిని పువ్వులు కోసినట్లుగా సుకుమారంగా చూపించిన విధం శాస్త్రవ్యుత్పత్తిలో గాఢంగా అవగాహించినవారికే అవగతం అవుతుంది. ఇక్కడ శ్రీవరవరమునులు చూపిన సమాధానం ఎటువంటిది అంటే,

తత్కాలంలో తోచే ఆనందానికి హేతువైన వ్యాపారానికి లీల అని పేరు. అయితే, ఇక్కడ మూలం సమన్వయం కావడం కోసం ఆ మాటను కొంచెం సంస్కరించుకొని అన్వయించుకోవాలి. తత్కాలంలో కలిగే రసానికి హేతువైన వ్యాపారం– అనే వరకు వెళ్లకుండా, "తత్కాలంలో కలిగే రసం" అని మాత్రం గ్రహించినప్పుడు, లీలాపదార్ధంగా గ్రహిస్తే మూలం సమన్వయం అవుతుంది– అని నిరూపించినవారయ్యారు ఇది లాక్షణికనిర్వాహం, ఔపచారిక నిర్వాహం అనబడుతుంది.

"జగత్స్రుష్టౌ లీలైవ ప్రయోజనమ్" అని శ్రీభాష్యకారుల దివ్యసూక్తిని ఒక చతుఃశాస్త్ర విద్వాంసుని చేతికి ఇచ్చి, పై సందేహాన్ని వ్యక్తం చేసి, సమాధానాన్ని చెప్పమని అడిగితే, అతడు చాలా శ్రమపడి, నాలుగైదు గంటల పాటు పలు వాక్యసమూహాలను విస్తృతంగా పలికి, ఏదో ఒక సమాధానాన్ని ఏదో విధంగా చెప్పవచ్చునేమో!. "సంగ్రహంగా దానిని తెలియజేయాలి" అని అంటే, ఏ విద్వాంసుడు

కూడా ఆ పనిని తృప్తికరంగా చేయలేడు– అని నేను నిశ్చయంగా అంటాను. శ్రీవరవరమునులు "తాదాత్వికరసమాత్రత్తై శొల్లిఱ్ఱాక క్కడవదు" అని చాలా అందమైన ఒక చిన్న వాక్యంలో సమాధానాన్ని పూర్తి చేయడం అనేది వారికి ఒక్కరికే కల అసాధారణమైన పాండిత్యప్రకర్షను ప్రకాశింపజేసే కొండమీద పెట్టిన దీపంవంటిది. దీనిని ఇక్కడ మేము తెలియజేయడం "శ్రీవరవరమునులు ఈ విధంగా లోతుగా గమనించి చూచేవారు" అనేదానిని తెలియజేయడంకోసంమాత్రమే కాదు. ఈ విధంగా శ్రమపడి నిర్వహించి, అనుగ్రహించే స్వభావం శ్రీ వరవరమునుల దగ్గర కొంచెం కూడా చూడడానికి అవకాశం లేదు– అని చూపడం కోసమే. విశదవాక్ శిఖామణి అనే పట్టం వీరికి ఒక్కరికే తగినది.

విమర్శించి చూడడంలో చాలా ఉన్నతమైన, ఇటువంటి శ్రీసూక్తులు మహాశాస్త్రజ్ఞుల మనసులను ద్రవీకరింపజేయగలిగినవి. ఇవి మణవాళమహామునుల రహస్యవ్యాఖ్యాన గ్రంథాలలో నిధిగా అమరి ఉండడాన్ని గమనించి చూసినప్పుడు, "నివురు కప్పిన నిప్పు" అనే ఒక సామెత ఉన్నద కదా, అది శ్రీవరవరమునులకే తగినది– అని పెద్దలు అంటారు. శ్రీసూక్తిని చూస్తే, అది తమిళ భాషలో ఉన్నది. అర్థాలను చూస్తే, అవిగహనమైన శాస్త్రార్థాలు. వీటిని అనుగ్రహించిన మహాచార్యులను చూస్తే, దంభం అనేది కొంచెం కూడా లేనివారు. వారి జ్ఞానపూర్తి, ఆత్మగుణపరిపూర్తియేకదా, నంబెరుమాళ్లను వారిని ఆశ్రయించేటట్లు చేశాయి. "ఇటువంటి గొప్పతనాన్ని కలిగిన మహాచార్యులను ఆశ్రయించే సంప్రదాయంలో మనం పుట్టాము" అనే భాగ్యవిశేషాన్ని భావించినప్పుడు అంతా, నా మనస్సు ద్రవిస్తుంది, నా వాక్కు తడబడుతుంది.

# భగవద్రామానుజులు –దివ్య ప్రబంధం

ఆళ్వార్లు అనుగ్రహించిన దివ్యప్రబంధాలు అన్నీ లోకంలో మలినమై, అంతర్ధానమైన కాలంలో శ్రీమన్నాథమునులు చాలా శ్రమపడి నమ్మాళ్వారులను యోగదశలో సాక్షాత్కరింపచేసికొని, అంతర్ధానమైన దివ్య ప్రబంధాలను అన్నిటిని మళ్ళీ తిరిగి పొంది విశేషప్రచారం చేసినట్లుగా సాంప్రదాయకమైన ఇతిహాసం ఉన్నది. "ఇది వాస్తవం కాదు, తరవాతవారు కల్పనగా రాశారు"– అని చెప్పడానికి వీలు లేనట్లుగా శ్రీమద్వేదాంత దేశికులు మొదలైన పూర్వాచార్యులు కూడా గురుపరంపరా సారం మొదలైన రహస్యగ్రంథాలలో ఈ విషయాన్ని ప్రస్తావించి రచించారు. అందుచేత మన సంప్రదాయానికి బహిర్భూతులైన కొందరు ఇతరులు ఏ విధంగా చెప్పినప్పటికీ, శ్రీవైష్ణవ సంప్రదాయంలో ఉండేవారు ఇందులో అతిశంకను పొందే అవకాశం లేదు. ఈ విధంగా ఉండగా, " దివ్యప్రబంధాలను వృద్ధి చేసినవారు భగవద్రామానుజులు" అనే ఒక ప్రసిద్ధి ఏర్పడింది. శ్రీరామానుజులకు వాళ్ళి తిరునామం అనుగ్రహించినవారు శ్రీమణవాళ మహామునులు. (ఆర్తిప్రబంధంలో ఇది ఉన్నది). అందులో "మాఱన్ ఉరై శెయ్ ద తమిళ్ మఱై వళర్ త్తోన్ వాళ్ళియే" (నమ్మాళ్వారులు అనుగ్రహించిన ద్రావిడవేదాన్ని వృద్ధి చేసినవారికి మంగళం) అని ఉన్నది. ఈ విషయాన్ని శ్రీరామానుజుల సమకాలీనులైన మహాచార్యుల శ్రీసూక్తుల వల్లకూడా చక్కగా తెలియగలుగుతున్నాము.

ఆళ్వారులు అనుగ్రహించిన సకలదివ్యప్రబంధాలకు తనియన్ పాశురాలు అనాధికాలంగానే అనుసంధింపబడుతున్నాయి. కొన్ని ప్రబంధాలకు ఒకటి, రెండు తనియన్ పాశురాలు, కొన్ని ప్రబంధాలకు అయిదారు తనియన్ పాశురాలు ఏర్పడి ఉన్నాయి. నమ్మాళ్వారులు అనుగ్రహించిన తిరువాయ్ మొళ్ళి దివ్యప్రబంధానికి సంస్కృత తనియన్ ఒకటి, ద్రావిడతనియన్ పాశురాలు ఐదు ఏర్పడ్డాయి. లోకంలో అంతటా అవి అనుసంధింపబడుతూ ఉన్నాయి. నమ్మాళ్వార్లు అనుగ్రహించిన, ద్రావిడవేదాలు అనదగిన ప్రబంధాలకు అంగాలుగా అవతరించిన, తిరుమంగై మన్నన్

అనుగ్రహించిన పెరియ తిరుమొ*ఴి* ప్రబంధానికి సంస్కృతతనియన్ శ్లోకం ఒకటి ద్రావిడతనియన్ పాశురాలు మూడు, మొత్తం నాలుగు తనియన్ లు అనుసంధింపబడుతున్నాయి.

ఇంచుమించుగా, అన్ని తనియన్ పాశురాలలో ఆ యా దివ్యప్రబంధాల గొప్పతనం, వాటిని అనుగ్రహించినవారి మహిమ, వారు అవతరించిన స్థలంలోని మహిమ మొదలైనవి చెప్పబడతాయి. తిరువాయిమొ*ఴి* తనియన్ లలో ఒకటి, పెరియ తిరుమొ*ఴి* ప్రబంధం తనియన్ లలో ఒకటి చాలా విలక్షణంగా అవతరించాయి.

తిరువాయ్ మొ*ఴి* ప్రబంధానికి కల తనియన్ పాశురాలలో–
"ఎయ్ న్ద పెరుమ్ కీర్తి ఇరామానుశమునితన్
వాయ్ న్ద మలర్ పాదమ్ వణంగుగిన్దేన్, – అయ్ న్ద పెరుమ్
శీరార్ శడగోపన్ శెందమి*ఴ్* వేదమ్ తరిక్కుమ్
పేరాద ఉళ్ళమ్ పెఱ".

అనే తనియన్ పాశురం భగవద్రామానుజుల శ్రీచరణాలలో చేసే ప్రార్థనగా ఏర్పడి ఉన్నది. ఈ వెణ్బావృత్తంలో ఉండే పాశురంలోని అర్థం ఏమంటే– చాలా గొప్పవైన కల్యాణ గుణాలను కల నమ్మాళ్వార్లు అనుగ్రహించిన తిరువాయ్ మొ*ఴి* ప్రబంధంలోని వేయి పాశురాలను చక్కగా ధరించి నిలుపుకోగలిగిన మనసును పొందడం కోసం గొప్ప కీర్తిని కలిగిన భగవద్రామానుజుల శ్రీచరణ పద్మాలను నమస్కరిస్తున్నాను –అనేది (భావం). స్వామీ! భగవద్రామానుజా! తిరువాయ్ మొ*ఴి* పాశురాలను మరచిపోకుండా ధరించగలిగిన సామర్థ్యాన్ని వరప్రసాదంగా నాకు అనుగ్రహించాలి– అని వారినే ఉద్దేశించి ప్రార్థించే రీతిలో ఇది ఏర్పడి ఉన్నది.

"పెరియ తిరుమొళ్ళి తనియన్ పాశురాలలో_
ఎంగళ్ కదియే! ఇరామానుశమునియే!
శంకై కెడుత్తాండ తవరాశా! — పొంగు పుగళ్ళ్
మంగైయర్ కోన్ ఈన్ద మఱై ఆయిరమ్ అనైత్తుమ్
తంగు మనమ్ నీ ఎనక్కు తా".

అనే ఈ తనియన్ కూడా ఇదే విధంగానే ఏర్పడి ఉన్నది. ఇది భగవద్రామానుజలను సంబోధిస్తూ చెప్పినది తిరుమంగై ఆళ్వారులు అనుగ్రహించిన పెరియ తిరుమొళ్ళి ప్రబంధంలోని వేయి పాశురాలను ధరించగలిగిన మనసును నాకు ఇవ్వాలి— అని భగవద్రామానుజలను ఉద్దేశించి ఇందులో ప్రార్థింపబడుతున్నది.

ఈ విధంగా ఈ రెండు తనియన్ పాశురాలను విశేషించి, మనసులో మననం చేసినట్లయితే, చాలా వైలక్షణ్యాన్ని కలిగిన ఒక పరమానందం కలగడంతో పాటు, భగవద్రామానుజల సాటి లేని ఒక గొప్పతనం కూడా తెలుస్తున్నది. ఆ యా దివ్యప్రబంధాలను ధరించే మనస్సును అనుగ్రహించాలి— అనే ప్రార్థనను ఆ యా ఆళ్వారులను ఉద్దేశించి చేసి ఉండవచ్చు. వారికి అంతరంగులైన మధురకవులు, శ్రీమన్నాథమునులవంటివారిని ఉద్దేశించి అయినా ప్రార్థనను చేసి ఉండవచ్చు. పరమోదారుడైన భగవంతుని ఉద్దేశించి ప్రార్థనను చేసి ఉండవచ్చు. సకలవిధసామర్థ్యాలను ఇవ్వగలిగిన లక్ష్మీదేవిని ఉద్దేశించి చేసి ఉండవచ్చు. (దీనికి ఉదాహరణంగా ఇరామానుశ నూత్తందాది ప్రబంధంలోని చివరి పాశురాన్ని గమనించవచ్చు). ఈ విధంగా ఉండే మార్గాలను అన్నిటిని విడచిపెట్టి, శ్రీరామానుజులను ఉద్దేశించి ఈ ప్రార్థనను చేయడం ఎందువల్ల? అని విమర్శించి చూడడం ఆవశ్యకం కదా. ఈ విషయంలో కొత్తగా మనం ఏమి విమర్శించి చూడబోతాము కనుక! ఆ కాలంలో ఆళ్వారులు సూక్తులు అన్నీ భగవద్రామానుజల అధీనంలో ఉన్నాయి— అనేది నిస్సందేహంగా తెలియదగినది అవుతున్నది. చాలా శ్రమపడి అధికరించి, పలుమార్లు మాటిమాటికి అనుసంధించి, గుర్తుపెట్టుకోవలసిన ఈ

గొప్పదైన బ్రహ్మ విద్యను శ్రీరామానుజులు ఒక్కరే "కలియుమ్ కెడుమ్ కండుకొణ్మిన్" (కలి నశిస్తుంది, చూడండి) అనే నమ్మాళ్వారుల పరమ కృప చేత, " " "ఆమ్ ముదల్వన్ ఇవన్"(ఇతడు సంప్రదాయనిర్వాహకుడు కాగలడు) అని అనుగ్రహించిన శ్రీయామునుల అద్భుతమైన అనుగ్రహాతిశయంచేత, అనాయాసంగా గ్రహించి, ఏ చోట కూడా ఏ విధమైన సందేహం, విస్మరణం లేకుండా ధరించగలిగినవారు అయ్యారు– అనేది సుస్పష్టం అవుతున్నది. లేకపోతే, ఈ తనియన్లు ఈ విధంగా అవతరించే అవకాశం లేదు కదా.

ఇంతేకాక, "ఎయ్ న్ద పెరుమ్ కీర్తి" అనే తనియన్ పాశురానికి తరువాత ఉండే " వాన్ తిగழ్మ్ శోలై" అని ఆరంభమయ్యే పాశురంలో " తమిழ் మఱైకళ్ ఆయిరముమ్ ఈన్ద ముదల్ తాయ్ శడకోపన్, మెయ్ మ్బాల్ వళర్ త్త ఇదత్తాయ్ ఇరామానుశన్" (ద్రావిడ వేదరూపాలైన తిరువాయ్ మొழి ప్రబంధం అనే వేయి పాశురాలను కన్నతల్లి నమ్మాళ్వారులు, వాటిని చక్కగా పెంచిన హితపరురాలైన తల్లి శ్రీరామానుజులు) అని చెప్పబడింది. తిరువాయ్ మొழిని కన్నతల్లి నమ్మాళ్వార్లు అని, దానిని పెంచిన తల్లి శ్రీరామానుజులు అని ఆ కాలంలో ఉండే ఆప్తతములైన ఆచార్యులు అనుగ్రహించారని అంటే, దివ్యప్రబంధాలలో శ్రీరామానుజులు ఎంతటి అభినవేశాన్ని కలిగి ఉండి ఉండాలి. దివ్యప్రబంధాలను అధికరించడంలో రుచి లేకుండా ఉండేవారిని వారు బలవంతంగా అధికరించమని నియమించారు. అక్కడక్కడ, అరుదైన, గొప్పతనం కలిగిన అర్థనిర్వాహాలను వ్యక్తం చేశారు. దివ్యదేశాలలో దివ్యప్రబంధాల ప్రచారాలను ప్రబలంగా, ప్రచురంగా చేశారు. ఈ విధంగా చేసిన కార్యాలను పురస్కరించుకునే, "మెయ్ మ్బాల్ వళర్ త్త ఇదత్తాయ్ ఇరామానుశన్" అని పూర్వాచార్యులు అన్నారు. ఆ కాలంలో భగవద్రామానుజులు అంతా శ్రమపడి ఉండకపోతే, దివ్యప్రబంధాలు శ్రీమన్నాథమునుల కాలానికి ముందే ఉండే విధంగానే లుప్తమైపోయి ఉండేవి. ఆ విధంగా కాకుండా ఉండే రీతిలో శ్రీరామానుజులు చేసిన రక్షణ వాచామగోచరం. " సర్వదేశదశాకాలేష్వవ్యాహతపరాక్రమా, రామానుజార్యదివ్యాజ్ఞా వర్ధతా

మభివర్ధతామ్, దిగంతవ్యాపినీ భూయాత్ సా హి లోకహితైషిణీ" అనే శ్లోకాన్ని గ్రామాలలో, నగరాలలో అంతట దివ్యప్రబంధసేవాకాలసమయాలలో అనుసంధిస్తున్నందున, ఆ రామానుజార్య దివ్యాజ్ఞ అనేది దివ్యప్రబంధ విషయమే తప్ప, వేరు విషయం కాదు – అనేది చక్కగా తెలుస్తున్నది. స్వస్తి.

# భగవద్రామానుజ దివ్యసూక్తి విశేషం

శ్రీరామానుజులు శ్రీభాష్యం మొదలైన దివ్యగ్రంథాలలో భగవంతునకు విశేషణాలను ప్రయోగించేటప్పుడు "అనంతగుణసాగరమ్" అని, "ఆపరిమితోదారగుణసాగరమ్" అని పలకడాన్ని మనం గమనిస్తాము. ఉదాహరణగా ఒక సందర్భాన్ని ఇక్కడ ప్రస్తావిస్తాను.

రెండవ అధ్యాయంలో ఆరంభంలో శ్రీభాష్యంలో "అపరిమితోదారగుణసాగరం పరం బ్రహ్మ వేదాంతవేద్యమ్ ఇత్యుక్తమ్" అని ఉన్నది. ఇది బ్రహ్మశబ్దంలోని ప్రథమావిభక్తి రూపమే తప్ప, తృతీయా విభక్తి రూపం కాదు. దీనికి విశేషణమైన "అపరిమితోదార గుణసాగరమ్" అనేదికూడా ప్రథమాంతరూపంగానే ప్రయోగింపబడవలసి ఉన్నది. సాగర శబ్దం నిత్యపుంలింగం కనుక, " గుణసాగరో బ్రహ్మ" అని చెప్పడం తగినది తప్ప, "గుణసాగరం బ్రహ్మ" అని చెప్పకూడదు. భగవంతుడు కల్యాణగుణాలకు సముద్రమై ఉన్నాడు– అనే అర్థమే సరసంగా తోస్తుంది కనుక, "గుణానాం సాగరః" అని తత్పురుష సమాసం వివక్షితం కావడానికే ఔచిత్యం ఉన్నది. ఈ విధంగా తత్పురుష సమాసాన్ని గ్రహిస్తే, "గుణసాగరం బ్రహ్మ" అనే ఈ ప్రయోగం ఉపపపత్తిని కలిగిన ఉండే దారే లేదు. తత్పురుషసమాసాన్ని విడచి బహువ్రీహిసమాసాన్ని గ్రహిస్తే, అంటే, "అనంతః గుణసాగరః యస్య తత్" అని, " అపరిమితః ఉదారగుణసాగరః యస్య తత్" అని సమాసాన్ని గ్రహిస్తే, "సాగరమ్" అని నపుంసకలింగంగా పొసగుతుంది. శ్రుతప్రకాశికాచార్యులవారు ఈ విధంగా బహువ్రీహిసమాసాన్నే స్పష్టంగా అనుగ్రహించారు. "భగవంతుడు గుణాలకు సముద్రంవంటివాడు"– అని అందరూ అంతటా చెప్పే, అనేక గ్రంథాలలో ఉండే ఈ రీతిని విడచిపెట్టి, గుణాలను సముద్రంగా చెప్పి, ఆ సముద్రాన్ని భగవంతుడు కలవాడు– అని ఈ విధంగా చెప్పడంలో ఏమి విశేషం ఉన్నది? అని కొందరు సందేహిస్తారు. కేవలం భగవద్రామానుజుల శ్రీసూక్తిలో తప్ప, వేరు ఏ గ్రంథంలోనూ ఈ విధంగా బహువ్రీహిసమాసంలో నిర్వహింపబడవలసిన ప్రయోగం ఎక్కడా కూడా కనిపించదు. వెతికి చూస్తే, శ్రీవైష్ణవాచార్యుల గ్రంథాలలో

లభిస్తుందేమో తప్ప, మిగిలినవారి గ్రంథాలలో పూర్తిగా ఏ మాత్రం లభించదు– అని స్థిరంగా చెప్పవచ్చు.

ఈ విధంగా భగవద్రామానుజులు ప్రయోగించడానికి ఒక ప్రబలమైన కారణం ఉన్నది. "తమిழ் మఱైగళ్ ఆయిరముమ్ ఈన్ఱ ముదల్ తాయ్ శడకోపన్ మెయ్మ్మాల్ వళర్ త్త ఇదత్తాయ్ ఇరామానుశన్" (ద్రావిడవేదరూపాలైన, వేయి పాశురాలను కల తిరువాయ్ మొழி ప్రబంధాన్ని కన్న తల్లి–నమ్మాళ్వారులు. దానిని చక్కగా వృద్ధి చేసిన హితపరురాలయిన తల్లి– శ్రీరామానుజులు) అనే విధంగా ఆళ్వారుల దివ్యసూక్తులను అభివృద్ధి చేయడంకోసమే అవతరించినవారైన మన భాష్యకారులు దివ్యసూరుల పాశురాలలోని అర్థాలను దృష్టిలో పెట్టుకునే తమ శ్రీసూక్తులను అనుగ్రహిస్తారు– అనే విషయం ఇంతకు ముందే పలు సాక్ష్యాలను చూపి, నిరూపించడం జరిగింది. ప్రకృతసందర్భం కూడా అందుకు ఒక గొప్ప ఉదాహరణ. నమ్మాళ్వారులు పెరియ తిరువందాది అనే ప్రబంధంలో ఒకచోట " మిగుమ్ తిరుమాల్ శీర్ క్కడలై ఉళ్ పొదింద శింద్పైనైయేన్" అని పలికారు ఈ సూక్తిలో భగవంతుని గుణాలు అనేవి సముద్రంగా చెప్పబడ్డాయి. "వణ్ తమిழ் మాముని" అయిన అగస్త్య మహర్షి ఉప్పు సముద్రాన్ని గ్రసించారు– అనే ప్రసిద్ధి ఉన్నది. నమ్మాళ్వారులు అనే "అరుమ్ తమిழ் మాముని" అయిన తాము ఉప్పు సముద్రాన్ని తాగకుండా, భగవద్గుణాలు అనే అమృత సముద్రాన్ని పానం చేశారను– అని ఇక్కడ చెప్పినట్లయినది. ఈ శ్రీసూక్తినే అవలంబించి ఆచార్యహృదయంలోకూడా మేఘూపదేశచూర్ణికలో " పూండనాళ్ శీర్ క్కడలై ఉట్కొండు" అని అనుగ్రహించడం జరిగింది. మేఘం సముద్రాన్ని గ్రసించినట్లుగానే, మేఘంగా చెప్పబడుతున్న ఆచార్యులుకూడా భగవంతుని కల్యాణ గుణాలు అనే సముద్రాన్ని పానం చేశారు –అని ఇక్కడ చెప్పబడింది. ఈ విధంగా అళ్వార్ల మనసులో భగవద్గుణాలు సముద్రంగా తోచినందున, "ఆ ఛాయలోని పలకాలి" అని భావించిన భగవద్రామానుజులు బహువ్రీహిసమాసంతో అర్థనిర్వహణను చేసే రీతిలోని ప్రయోగాన్ని చేసి, భగవంతుని కల్యాణగుణాలకు సాగరత్వాన్ని సుస్థాపించినవారయ్యారు.

ప్రసంగవశాత్తు దీనితో సమానమైన ఇంకొక విషయం ఇక్కడ తెలుపబడుతున్నది. స్తోత్రరత్నం మొదటిశ్లోకంలో "అగాధభగవద్భక్తిసింధవే" అనే చోట వ్యాఖ్యానాన్ని అనుగ్రహించే వేదాంతదేశికులు, "శ్రీమన్నాథమునుల భగవద్భక్తికి సింధువువంటివారు"— అని తత్పురుషసమాసంగా ముందు అర్థాన్ని నిర్వహించి, తరువాత, "భక్తిం వా సింధుత్వేన రూపయిత్వా బహువ్రీహిః" అని వివరించారు. "అగాధమైన భగవద్భక్తిసాగరాన్ని కలవారు"— అని దీని అర్థం. ఈ విధంగా బహువ్రీహిని గ్రహించడం ఎందుకంటే, "కాదల్ కడల్ పురైయ విళైవిత్త" (5—3—4) (సముద్రం నిండే విధంగా ప్రేమను కలిగించి) అనే తిరువాయ్ మొ*ழி* ప్రబంధంలోని పాశురం భక్తిని సముద్రంగా చెప్పడాన్ని బట్టియే —అనికూడా ఇక్కడ తెలియాలి.

# ద్రావిడభాషామర్యాద

సంస్కృతభాషా మర్యాద, ద్రావిడభాషామర్యాద అనే రెండు మర్యాదలు కొన్ని విషయాలలో పోలి ఉంటాయి. పలు విషయాలలో తేడాగా ఉంటాయి. సంస్కృత భాషలో ఒక పదానికి ఎన్నో అర్థాలు ఉండేటట్లే, ద్రావిడ భాషలో కూడా ఆ విధంగా ఒక పదానికి పలు అర్థాలు ఉంటాయి. సంస్కృత భాషలోని హరిః అనే ఒక పదాన్ని మనం గ్రహించినట్లయితే, దానికి విష్ణువు, సూర్యుడు, అశ్వం, కప్ప మొదలైన పలు అర్థాలు నిఘంటువులలో చెప్పబడినట్లు గమనిస్తాము. విష్ణువును ఉద్దేశించే "హరిః" అనే ఈ పదాన్ని ఎక్కువగా ఉపయోగించడం జరుగుతున్నా, మిగిలిన అర్థాలలోకూడా ఈ పదాన్ని ప్రయోగించడంలో తప్పు లేదు. ఈ విధంగా ప్రయోగించే సందర్భాలు చాలా కనిపిస్తాయి విష్ణువాచకంగా దీనిని ప్రయోగించే సమయంలో, విష్ణువువిషయంలో ప్రయోగించదగిన విశేషణాలను ఈ పదానికి కూడా ప్రయోగిస్తారు. "పీతాంబరాయ హరయే గురవే నమోస్తు", అనే ఒక శ్లోకాన్ని ఉదాహరణగా తీసుకుందాం. ఇందులో హరికి పీతాంబరత్వం విశేషణమై ఉన్నది. పీతాంబరాన్ని ధరించేవాడు– అనేది దీని అర్థం. ఈ విశేషణ సామర్థ్యంచేత మనం హరిశబ్దార్థాన్ని ఇక్కడ నిశ్చయించుకునే అవకాశం ఉన్నది.

హరిశబ్దానికి "కప్ప" అనే అర్థం కూడా ఉన్నందున, ఆ అర్థాన్ని వివక్షించి, హరిపదాన్ని ప్రయోగించేటప్పుడు, పీతాంబరత్వవిశేషణం ప్రయోగించవచ్చునా? అని అంటే, "ప్రయోగించకూడదు" అని నిశ్చయంగా చెప్పవచ్చు.

అయితే, ద్రావిడభాషలో ఈ విధంగా లేదు. ఆ భాషలో ఒక పదానికి రెండు అర్థాలు ఉన్నట్లయితే, ఒక అర్థానికి అన్వయించే విశేషణాన్ని ఇంకొక అర్థానికికూడా ఉపయోగించే రీతి ఉన్నది. దీనికి కొన్ని ఉదాహరణలను చూపించి, సహృదయుల మనస్సులో ఈ విషయం నిలిచేట్లుగా చేస్తాను.

వంజి అనే ఒక పదాన్ని తీసికొందాం. దీనికి "వంజిమరమ్" అనే ఒక వృక్షవిశేషం అర్థం. చేరదేశప్రభువుల రాజధాని అయిన వంజిమహానగరంఅని కూడా దీనికి అర్థం. ఈ పదాన్ని ప్రయోగించి, వంజి అనే వృక్షవిశేషాన్ని చెప్పాలంటే ఉపయోగించదగిన "ఇలై, కాయ్, కొడి" (ఆకులు, కాయలు, తీగలు) మొదలైనవానిని కలిగి ఉండడాన్ని తెలిపే విశేషణాలు వంజినగరాన్ని చెప్పేటప్పుడు ఉపయోగపడనివి అయినా, కవులు వాటిని తమ ప్రయోగాలలో ఉపయోగించడం ఉన్నది. పరిపాడల్ అనే గొప్ప ద్రావిడగ్రంథంలో 12వ పాశురవ్యాఖ్యానంలో పరిమేలழగర్ అనే వ్యాఖ్యాత "తెట్టిలే వంజిక్కో" అనే దానిని ఉదాహరణగా చూపించారు. పుఱనానూఱు అనే గ్రంథంలోని 38వ పాశురంలో "పుల్లిలై వంజి ప్పుఱమదిల్లైక్కుమ్ కల్లెన్ పొరుదై" అని ఉన్నది. ఇక్కడ వంజి మహానగరం వివక్షితం తప్ప, వంజివృక్షం వివక్షితం కాదు. అయినా, వృక్ష విశేషంలోని అర్థానికి తగిన "తెట్టిలై, పుల్లిలై" అనే విశేషణాలు ఆ వృక్షనామాన్ని కలిగిన వంజిమహానగరాన్ని ఉద్దేశించి ఉపయోగించారు– అనేది చక్కగా చూడడానికి వీలవుతున్నది.

నాగం అనే పదం పున్నాగ వృక్షానికి, సర్పానికి పేరు. పరిపాడల్ అనే గ్రంథంలో నాగం అనే పదాన్ని ప్రయోగించి, పున్నాగ వృక్షాన్ని చెప్పేటప్పుడు, సర్పానికి తగిన విశేషణాలను పున్నాగవృక్షానికి కూడా ప్రయోగించారు " ఒళి తిగழ் ఉత్తి ఉరుకெழு నాగమ్" అని 12వ పాశురంలోని ప్రయోగాన్ని గమనించవచ్చు.

ఈ విధంగా ద్రావిడగ్రంథాలలో కనిపించే సంప్రదాయం ఆళ్వారుల దివ్యప్రబంధాలలో కూడా కనిపిస్తుంది– అనే విషయాన్ని ఇక్కడ తెలియజేస్తాను. తిరుమంగై ఆళ్వారులు అనుగ్రహించిన పెరియ తిరుమొழி ప్రబంధంలో (3–8–8) " తుళైయార్ కరుమెన్ కుழలాచ్చియర్" అనే పాశురంలో కేశాలకు "తుళైయార్" అనే ఒక విశేషణం ప్రయోగింపబడింది. ఇక్కడ "కుழల్" అనే పదానికి కేశాలు– అని అర్థం. అయితే, ఇదే పదం "వేణువు" అనే అర్థానికి కూడా వాచకం అయినప్పటికీ, ఆ అర్థం

ఇక్కడ వివక్షితం కాదు. "కేశాలు" అనే అర్థమే వివక్షితం. అయితే, దానికి "తుళైయార్" అని ప్రయోగింపబడిన విశేషణం ఏ విధంగా పొసగుతుంది? అని పరిశీలించాలి. వేణువులో రంధ్రాలు అక్కడక్కడ ఉండడం ప్రసిద్ధం. అందుచేత రంధ్రాలు నిండిన వేణువును చెప్పదగిన "కుழల్", అనే పదంతో ఇక్కడ చెప్పబడుతున్న కేశాలు కలిగినవారైన గోపికలు— అనేది ఇక్కడ తాత్పర్యం.

ఇక్కడ ఇంకొక విధంగా అర్థాన్ని చెప్పే అవకాశం ఉన్నప్పటికీ, ఈ విధంగాకూడా నిర్వహించే రీతి ఉన్నది— అని, ద్రావిడభాషామర్యాదలో ఇది ఒక విశేషార్థంగా తెలియదగినది— అని ఇక్కడ తెలుపడంకోసమే ఈ విధంగా అర్థవివరణం చేయబడింది.

# సంస్కృతభాషామర్యాద

సంస్కృతభాషలో ఉండే అనేక విధాలయిన నియమాలలో ఇది కూడా ఒక నియమం. అది ఏమంటే– ప్రథమా విభక్తిలో కర్తృపదం ఉంటే, అది ఒక సమాపకక్రియాపదంతో అన్వయించి ముగుస్తుంది తప్ప, . మధ్యలో ఉండే అసమాపక క్రియలతో అన్వయించి పూర్తి కాదు– అనేది ఈ నియమం. దీనిని సంస్కృతసరణిలో వివరిస్తాను. ప్రథమావిభక్తికం అయిన కర్తృపదం ఉన్నట్లయితే, అది ఒక కారకక్రియాపదంతో కానీ, తిజంతక్రియాపదంతో కానీ అన్వయించి ముగుస్తుంది తప్ప, ల్యబంతం మొదలైన మధ్యలో ఉండే అన్వయాలలో అన్వయించి నిలువదు –అని దీని తాత్పర్యం.

"చైత్రః గ్రామం గత్వా మైత్రం దదర్శ" అనే ఒక వాక్యాన్ని చూద్దాం. చైత్రుడు అనే పేరు గలవాడు గ్రామానికి వెళ్లి మైత్రుని చూచాడు– అనేది ఈ వాక్యంలోని అర్థం. ఇందులో "చైత్రః" అనే కర్తృపదం "దదర్శ" అనే క్రియతో అన్వయించే ముగుస్తున్నది. "చైత్రుడు భుజించడానికి మైత్రుడు వండాడు" అని చెప్పవలసి వస్తే, "చైత్రః భోక్తుం మైత్రః పచతి స్మ" అనే ప్రయోగించవచ్చునా? అని చూడాలి. ఈ విధంగా ప్రయోగించడాన్ని శాస్త్రజ్ఞులు సహించరు. ఎందుకంటే, "చైత్రః" అనే కర్తృపదం ఒక సమాపక క్రియలో అన్వయించే తీరాలి కనుక, ఇక్కడ ఉండే "పచతి స్మ" అనే సమాపక క్రియలో అది అన్వయించడం లేదు కనుక, ఈ ప్రయోగం దుష్టమని చెప్పబడుతుంది.

శ్రాద్ధప్రయోగంలో "ఇదం క్షేత్రం గయాక్షేత్రసదృశం భూత్వా, ––– మమ అధికారసంపదస్తు" అని పురోహితులు చెప్పే వాక్యాన్ని పెద్దలు ఆక్షేపించి, దానిని సంస్కరిస్తున్నారు. దీనికి కారణం– ఇంతకు ముందు నేను చెప్పిన విషయమే. ప్రథమావిభక్తికం అయిన ఒక కర్తృపదం ఉన్నట్లయితే, అది సమాపకక్రియతో అన్వయించే తీరాలి– అని, ఆ విధంగా అన్వయించని ఆ వాక్యం ఉన్నట్లయితే, అది దుష్టమని దృఢంగా గ్రహించవలసినదే.

ఇక్కడ "ఇదం క్షేత్రం" అనే ప్రథమా విభక్తిలో ఉండే కర్తృపదం "అస్తు" అనే సమాపక క్రియలో అన్వయిస్తే, ఇది ఏ దోషం లేని ప్రయోగమే అవుతుంది. "అస్తు" అనే క్రియాపదంలో ఇది అన్వయించదు కనుక, మధ్యలో ఉండే "భూత్వా" అనే పదంలో అన్వయిస్తున్నందున, ఈ ప్రయోగం వ్యాకరణశాస్త్రరీతిలో సాధువు కాదు. అందుచేత, "ఇదం క్షేత్రం గయాక్షేత్రసదృశం భూయాత్" అని పెద్దలు సంస్కరించడం తగినదే అవుతున్నది.

# శ్రీరామాయణంలో ఒక అపూర్వ విషయం

శ్రీమద్వాల్మీకి రామాయణంలో యుద్ధకాండం ఆరంభంలో ఒక ముఖ్యమైన విషయం విడచిపెట్టబడినది– అని కొందరు పెద్దలు భావిస్తున్నారు. అది ఏమంటే– సుందరకాండలో హనుమంతుడు లంకలోకి వెళ్లి, ఆ నగరంలోని పలు భాగాలను నాశం చేసి, నిప్పు పెట్టి, పాడుచేసిన విషయం వివరంగా చెప్పబడింది. లంకలో అందంగా ఉండే సన్నివేశాలను అన్నిటిని హనుమంతుడు చాలా శిథిలం చేసి, నాశనం చేశాడు– అనే విషయంలో ఎవరికీ వివాదం ఉండే ప్రసక్తే లేదు.

తరువాత శ్రీరాముడు లంకకు వెళ్లి యుద్ధం చేసిన కాలంలో అక్కడ ఏమి మిగిలి ఉన్నది? ఇంతకు ముందే హనుమంతుని వీర్యానికి లక్ష్యమై, శిథిలం అయిన లంకను శ్రీరాముడు నాశనం చేశాడు– అని అనడంలో ఔచిత్యమూ లేదు, అతిశయం అంతకంటే లేదు కదా.

కంబరామాయణం యుద్ధకాండంలో ఇరావణన్ మందిరప్పడలం మొదటిలో కొన్ని పాశురాలు కనబడుతున్నాయి. వాటిలో "పూవరు మయనోడుమ్ పుకుందు పొన్నగర్ మూవకై యులకినుమ్ అழకు ముற்றுఅ–––దెయ్ వత్తచ్చనే" అనే ఒక పాశురంలో దెయ్ వ త్తచ్చన్(మయుడు, లేక విశ్వకర్మ) హనుమంతుడు లంకలో పాడు చేసిన ప్రదేశాలను బాగు చేసి, అన్ని లోకాలలో ఉండే అన్ని నగరాల కంటే ఆ లంకాపురిని చాలా అందమైన నగరంగా తోచేటట్లు చేశాడు– అని చెప్పబడింది ఈ విధంగానే, "పొన్నినుమ్ మణియినుమ్ అమైంద––" అనే పాశురంలో వీరకడియాలను అలంకరించుకున్న రావణుడు నవరత్నాలు పొదిగిన అందమైన తన లంకాపురిని చూచి, దేవలోకంలో ఉండే నగరాన్ని చూసి, ఆ దేవలోకంలోని నగరం కంటే ఇప్పుడు మయుడు సంస్కరించిన తన నగరం అందంగా ఉండడంతో, "దగ్ధం చేయబడడానికి ముందు ఉన్నదాని కంటే తన నగరం అతిశయించిన అందం పొందినది" అని గమనించి,

దగ్ధం చేయబడడం కూడా మంచిదే అయింది— అనే భావంతో సంతోషాన్ని పొంది, కోపం తీరినవాడయ్యాడు— అని చెప్పబడింది.

ఈ విధంగా దెయ్ వ త్తచ్చన్ (మయుడు) లంకానగరాన్ని సంస్కరించినట్లుగా కథ ఉంటే తప్ప, ఉపపత్తి లేనందుచేత, ఈ కథ చాలా ఆవశ్యకమైనది. ఈ కథ వాల్మీకిరామాయణంలో కనబడడం లేదు— అనేది ఒక కొరతయే. ఈ వృత్తాంతాన్ని తెలిపే ఒకటి, రెండు శ్లోకాలు వాల్మీకి రామాయణంలో కూడా ఉన్నాయి అని, ఇపుడు అచ్చు ప్రతులలో అవి దోపించి పోయాయి— అని, కొన్ని వ్రాతప్రతులలో ఇప్పుడు దొరుకుతున్నాయి —అని కొందరు పెద్దలు చెబుతున్నారు— అని నేను విన్నాను.

"హరో ఽ పి నార్పితః కంఠే" అనే శ్లోకం శ్రీరాముని వాక్కుగా శ్రీవచనభూషణంలోనూ దాని వ్యాఖ్యానంలోనూ ఉదాహరింపబడినది అయినా, అది శ్రీరామాయణ కోశాలలో ఇపుడు లభించడం లేదు. అది పూర్వం ఉండి, ప్రస్తుతం లోపించిందని భావించాలి. ఆ శ్లోకం కూడా వ్రాతప్రతులలో కనబడుతున్నది— అని కూడా కొందరు చెప్పగా నేను విన్నాను.

# శ్రీసీతారాముల వయోవిమర్శ

శ్రీరామునకు, సీతాదేవికి వివాహం జరిగేటప్పుడు వారి వయస్సు ఎంత? వారిద్దరూ వనవాసానికి బయలుదేరినప్పుడు వారి వయస్సు ఎంత? అని ఈ విధంగా కొన్ని విచారాలను పెద్దలు చేయడం ఉన్నది. శ్రీరామాయణ శ్లోకాలను పురస్కరించుకొని ఈ విషయాన్ని నిర్ణయించాలని చూసినప్పుడు, కొన్ని శ్లోకాలు ఒకదానితో ఇంకొకటి విరుద్ధంగా ఉన్నట్లు కనబడుతున్నందున, ఏ విధంగా అర్థాన్ని నిర్వహించడం? అని కొందరు సందేహాన్ని పొందడం కూడా ఉన్నది. ఈ విషయంగా ఇంతకు ముందే పెరియ వాచ్చాన్ పిళ్లై వంటి పూర్వాచార్యులు కొన్ని విమర్శలను చేశారుకూడా. ఈ విషయం గురించి సంగ్రహంగా నిరూపింపబడుతున్నది.

రావణుడు కపటసన్యాసివేషంతో సీతాదేవి దగ్గరకు వచ్చినప్పుడు, అతనిని నిజమైన యతిగానే భావించి, ఆదరంతో సంభాషించే సమయంలో, సీతాదేవి

"మమ భర్తా మహాతేజాః వయసా పంచవింశకః,

అష్టాదశ హి వర్షాణి మమ జన్మని గణ్యతే"

అని అంటూ పలికినట్లు శ్రీరామాయణంలో ఉన్నది. ఇందువల్ల తాను అయోధ్యలోనుండి అరణ్యానికి బయలుదేరినప్పుడు, తన భర్త అయిన శ్రీరాముని వయస్సు 25 సంవత్సరాలుగాను, తనకు 18. సంవత్సరాలుగాను ఆమె తెలిపినట్లు అయినది.

మిథిలానగరంలో శ్రీరామునితో వివాహం జరిగిన తరువాత, అయోధ్యకు వచ్చి చేరి, 12 సంవత్సరాల కాలం సకలదివ్యభోగాలను అనుభవిస్తూ తాను జీవించినట్లు, దానికి తరువాత, వనవాస సంభవం జరిగినట్లుకూడా ఆ సీతాదేవియే చెబుతున్నది.

"సమా ద్వాదశ తత్రాహం రాఘవస్య నివేశనే,

భుంజానా ౽ మానుషాన్ భోగాన్ సర్వకామ సమృద్ధినీ"

అనే సీతాదేవి పలికిన శ్లోకంవల్ల ఇది విశదం అవుతున్నది. ఈ శ్లోకంలోని పూర్వార్ధం "ఉషిత్వా ద్వాదశ సమా ఇక్ష్వాకూణాం నివేశనే" అనే పాఠభేదంతో కూడా కనపడుతున్నది. అయితే, అర్థం ఒకటే. "ద్వాదశ సమా" అనేదానికి 12 సంవత్సరాలు— అని అర్థం. ఇది ద్వితీయా బహువచనం.

ఈ విధంగా ఇంతకు ముందు ఉదాహరించి చూపించిన రెండు శ్లోకాలను గమనించి చూసినప్పుడు, వివాహకాలంలో శ్రీరామునకు 13 సంవత్సరాల వయస్సు అని, సీతాదేవికి ఆరు సంవత్సరాల వయస్సు అని ఏర్పడుతున్నది. ఇది పొసగుతుందా? అని చూడాలి.

"ప్రతిసంయోగసులభం వయో దృష్ట్వా చ మే పితా,
చింతార్ణవగతః వారం నాససాదాప్లవో యథా"

అనే సీతాదేవి వచనాన్ని గమనించాలి. తనకు భర్తతో చేరవలసిన వయస్సు ప్రాప్తం అయినట్లు, అప్పుడు తగిన భర్త లభించనందున తండ్రి అయిన జనకచక్రవర్తి చాలా విచారంలో మునిగినట్లు ఈ శ్లోకంలో చెప్పబడింది. కాలభేదాలు ఏ విధంగా ఉన్నప్పటికీ, ఆరు సంవత్సరాల వయస్సు పతిసంయోగ సులభం అయిన వయసు అని చెప్పడం ఉచితంగా తోచలేదే! శాస్త్రీయక్రమంలో కన్యాదానం చేయడానికి యోగ్యత అప్పుడు ప్రాప్తమయ్యే అవకాశం లేదు. కన్యాదానం చేయడానికి ఆరు సంవత్సరాల వయస్సు తగినది కాదు. తండ్రి చాలా విచారపడదగిన వయస్సు కూడా పది పన్నెండు సంవత్సరాల మధ్య అయి ఉండాలి— అని కొందరు నిరూపకులు వ్రాశారు.

రావణునితో సీతాదేవి పలికిన మాటను ఇప్పుడు పరిశీలించి చూద్దాం. "మమ భర్తా మహాతేజాః వయసా పంచవింశకః "అని శ్రీరాముని వయస్సును ఉద్దేశించి చెప్పి, తరువాత తన వయస్సును చెప్పేటప్పుడు సీతాదేవి "మమ జన్మని గణ్యతే" అని

అన్నది. ఈ విధంగా మాటలోని తేడాను పురస్కరించుకొని, మనం లోతుకు విమర్శించి చూడాలి. సీతాదేవి అయోనిజ అనేది, జనకమహారాజుకు ఆమె అదృష్టవశంచేత లభించిన బిడ్డ అనేది సుప్రసిద్ధం. అందుచేత జనకచక్రవర్తికి సీతాదేవి లభించినప్పుడే ఆమెకు నాలుగైదు, లేక, ఐదు ఆరు సంవత్సరాలు దాటి ఉండాలి– అని చక్కగా ఊహించే అవకాశం ఉన్నది. సహజజననం లేని, లేక, తెలియని శిశువుకు దొరికిన కాలమే జననకాలమని భావించాలి. అందుచేత జనకచక్రవర్తికి సీతాదేవి తాను లభించిన ముహూర్తం మొదలుపెట్టి తన వయస్సును లెక్కపెట్టి, "అష్టాదశ హి వర్షాణి మమ జన్మని గణ్యతే" అని అంటున్నది– అని భావించడంలో ఏ విధంగాను అనుపపత్తి లేదు. అందువల్లనే శ్రీరామునిగూర్చి చెప్పేటప్పుడు"వయసా" అని అన్నట్లుగా, తనను గూర్చి చెప్పిన సందర్భంలో ఆ విధంగా చెప్పకుండా, "జన్మని గణ్యతే" అనే శబ్దప్రయోగాన్ని సీతాదేవి చేసింది. " వయసా" అనే మాటను ఆమె ప్రయోగించి ఉంటే, అప్పుడు వేరు విధంగానే చెప్పాలి కదా.

# ముదలాళ్వార్ల వైభవమ్

(మహావిద్వాన్, కాంచీ అణ్ణంగరాచార్యస్వామివారి ద్రావిడవ్యాసం ఆధారంగా)
ముదలాళ్వారుల తిరునక్షత్రోత్సవాల సందర్భంగా సమర్పణం
దాసుడు– ఈ. ఏ. శింగరాచార్యులు

మన సంప్రదాయంలో, ముదలాళ్వార్లు అనే పేరుతో కీర్తింపబడేవారు– సరోయోగి అనే పేరును కలిగిన పొయ్ గై అళ్వార్లు, భూతయోగి అనే పేరును కలిగిన పూదత్తాళ్వార్లు, మహాయోగి అనే పేరును కలిగిన పేయాళ్వార్లు అనే ముగ్గురు. "ఓడి త్తిరియుమ్ యోగిగళ్" (సదా సంచరిస్తూ ఉండే యోగులు) అనే విధంగా గ్రామైకరాత్రంగా సంచరిస్తూ ఉండేవార్రై, తమలో తాము ఎవరికీ తెలియకుండా చాలాకాలం వీరు ఉన్నట్లు, ఈ ముగ్గురిని ఒకే చోట చేర్చి అనుగ్రహించాలని భగవంతుడు కుతూహలాన్ని పొందినట్లు, ఒకనాడు సూర్యుడు అస్తమించిన తరువాత, పొయ్ గై ఆళ్వార్లు, చాలా పెద్ద వర్షం కురిసినందున, తిరుక్కోవలూర్ అనే క్షేత్రాన్ని చేరి, అక్కడ మృకండుముని ఆశ్రమానికి వెళ్లి, ఆ ఇంటి మధ్య భాగంలో పరుండి ఉన్నట్లు, ఆ సమయంలో పూదత్తాళ్వార్లు, పేయాళ్వార్లు కూడా అక్కడికే వచ్చి చేరి, ఆ చోటనే వారు కూడా తలదాచుకున్నట్లు, ఈ విధంగా ఈ ముగ్గురు కలిసి ఉండే ఆ సమయంలో భగవంతుడు అదృశ్యంగా వచ్చి వీరి మధ్యలో చేరి సమ్మర్దాన్ని కలిగించినట్లు వీరి చరిత్రలో చెప్పబడింది. ఇందువల్ల ఈ ఆళ్వార్లు ముగ్గురు తిరుక్కోవలూర్ దివ్యక్షేత్ర విషయంలో చాలా అభినివేశం కలిగినవారు– అని తెలుస్తున్నది. అన్యోన్యం కీర్తింపబడేవారుగా చెప్పబడే ఆళ్వార్లలో చివరివారైన తిరుమంగై మన్నన్ తిరుక్కోవలూర్ దివ్యదేశాన్ని కీర్తించే దశకంలో పలికేటప్పుడు, పై వృత్తాంతాన్ని పరమ రస్యంగా అనుసంధించిన సొబగు విజ్ఞాపన చేయబడుతున్నది.

తిరుమంగై మన్నన్ పెరియ తిరుమొழి ప్రబంధంలోని తిరుక్కోవలూర్ క్షేత్రానికి కీర్తించే దశకంలోని నాలుగవ పాశురంలో (2–10–4) "ఆంగరుంబి క్కణ్ణీర్ శోర్ న్దన్బు

కూరు మడియవర్ కట్కు అరావముదు మానాన్ తన్నై" అని పలికిన శ్రీ సూక్తినిగూర్చి ఆచార్యహృదయం అనే దివ్య గ్రంథంలో నాయనార్ తెలియజేసిన పరమ రహస్యార్థం ఇక్కడ వివరింపబడుతున్నది. ఆ గ్రంథంలో మూడవ ప్రకరణంలో మేఘానికి స్వాపదేశార్థాన్ని తెలియజేసే పూండనాళ్ నీర్కడలై ఉట్కొండు" ఇత్యాది చూర్ణికలోని "అన్బు కూరు మడియవర్" అనే పదసందర్భాన్ని వ్యాఖ్యానించే మణవాళ మహామునులు "ఆంగరుంబి క్కణ్ణీర్ శోర్ న్దన్బు కూరు మడియవరాన ముదలాళ్వార్గళ్" అని వివరిస్తూ పలికిన సూక్తి గమనించదగినది. "ఆంగరుంబి క్కణ్ణీర్ శోర్ న్దన్బు కూరు మడియవర్" అనే శ్రీసూక్తి తిరుమంగై యాళ్వార్ తిరుక్కోవలూర్ దశకంలో ఉండే ప్రయోగం అనే విషయాన్ని ఇక్కడ మనం మరువకూడదు. అటువంటి, తన విషయంలో ప్రేమను వ్యక్తం చేసే భక్తులకు అమృతంగా ఉండేవాడు, తిరుక్కోవలూర్ దివ్యదేశంలో వేంచేసి ఉండే స్వామి" అని ఆ సూక్తిలో స్తుతింపబడింది. అక్కడ "అడియవర్" అనే పదానికి ముదలాళ్వార్లు– అని అర్థం– అని మన పూర్వాచార్యులు ఏకకంఠంగా అభిప్రాయపడ్డారు– అనే విషయాన్ని శ్రీ మణవాళ మహామునుల వ్యాఖ్యాన సూక్తి ద్వారా వ్యక్తం అవుతున్నది. ఈ అర్థనిర్వాహం చాలా చక్కని ఉపపత్తితో కూడినది– సప్రమాణంగా నిరూపింపబడుతున్నది.

"అడియవర్, అన్బుకూరు మడియవర్, ఆంగరుంబి క్కణ్ణీర్ శోర్ న్దన్బు కూరు మడియవర్" అని ఈ విధంగా ఇక్కడ ఆళ్వార్ల ప్రయోగాన్ని విభాగం చేసి, మూడు విధాలుగా అన్వయించుకోవాలి, ముందుగా, "అడియవర్" అనే పదం పేయాళ్వార్లను తెలియజేస్తుంది. వీరు తమ ప్రబంధంలో "తిరుక్కండేన్ పొన్మేని కండేన్" అని మొదటి పాశురంలో భగవంతుని దివ్య మంగళ విగ్రహాన్ని తాము దర్శించినట్లుగా పలికి, ఆ దివ్య మంగళ విగ్రహంలోని శ్రీచరణాలే మనకు ఉద్దేశ్యం– అనే విషయాన్ని తమ మూన్టామ్ తిరువందాదిలో ఆదిమధ్యాంతాలలో చాలా అందంగా తెలియజేశారు. "ఇన్ఱే కழల్ కండేన్" అని ప్రారంభంలో అన్నారు. "పైంబొన్ ముడియా నడియిణక్కే పూరిత్తెన్నెంజే పురి", "ముయన్ఱు తొழு నెంజే! –––తణ్ణలంగల్ మాలైయాన్ తాళ్", "కరియాన్

కచ్ఛలే లొల్లరుళ్ తన్ మేల్ కండాయ్ తెళి", "వాళ్మమ్ వకై అఱిన్దేన్––– ఎంగళ్ పెరుమానడి శేర ప్పెఱ్ఱు" అని మధ్యలో పలకడం గమనించవచ్చు. ప్రబంధం చివరలో కూడా " కుట్టత్తు క్కోళ్ ముదలై తుంజ కుఱిత్తెరింద శక్కరత్తాన్ తాళ్ ముదలే నంగట్కు చ్చార్ వు" అని భగవంతుని శ్రీచరణాలే గతి అని పలుకుతూ ప్రబంధాన్ని పూర్తి చేశారు. అందుచేత, ఈ విధంగా భగవంతుని శ్రీ చరణాలనే దృఢంగా ఆశ్రయించినవారు– అనే కారణంచేత పేయాళ్వార్లు "అడియవర్" అని చెప్పబడ్డారు.

తరువాత, "అన్బు కూరు మడియవర్" అనే ప్రయోగం పూదత్తాళ్వారులను తెలుపుతుంది. ఏ విధంగా అంటే, "అన్బు కూరుమ్" అనే ప్రయోగానికి "ప్రేమ అతిశయించినవారు"– అని అర్థం. ఈ ఆళ్వారులు "అన్బే తకళియా" అని ఆరంభించి, "విళవిన్ కాయ్ కన్జినాల్ వీళ్త్తవనే! ఎన్జనళవన్జాల్ యానుడైయ అన్బు" (వెలగ కాయను లేగ దూడ ద్వారా రాలగొట్టిన వాడా! నా అవధికి మించినది సుమా, నా ప్రేమ) అని చివరి పాశురంలో తమ ప్రేమాధిక్యాన్ని స్వయంగా నోరు తెరిచి పలికినందున, వీరు "అన్బుకూరు మడియవర్" అని చెప్పదగినవారు అయ్యారు.

ఇక, చివరగా, "ఆంగరుంబి క్కణ్ణీర్ శోర్ న్దన్బు కూరు మడియవర్" ఎవరంటే, పొయ్ గై యాళ్వారులే. ఏ విధంగా అంటే, ఈ ఆళ్వారులు " పఱ్ఱదే పల పగలుమ్ పోయిన ఎన్జు అంజి అఱ్ఱదేన్" (వ్యర్థంగా పలు దినాలు గడచిపోయాయి అని భయపడి ఏడ్చాను) అని తమ వాక్కుతో పలికిన విధంగా కన్నీరు కార్చినవారు వీరు, కనుక.

ఈ విధంగా ముదలాళ్వార్లను ముగ్గురిని అందంగా సూచించి, వీరికి ముగ్గురికి అమృత స్వరూపుడై ఉండేవాడు, తిరుక్కోవలూర్ క్షేత్రంలో ఉండే స్వామి –అని తిరుమంగై అళ్వార్లు అనుగ్రహించారు.

శ్రీమన్నిగమాంత మహాదేశికులు కూడా "అడియవర్ కట్కు ఆరముదమానాన్" అనే సూక్తిని దృష్టిలో పెట్టుకొని, దేహలీహస్తుతిలో "కాసారపూర్వకవిముఖ్య విమర్ధజన్మా పణ్ణాతటేషు సుభగస్య రసో బహు స్తే" (పొయ్ గై ఆళ్వారులు మొదలైన గొప్పకవులైన ముదలాళ్వారులకు కలిగిన సమ్మర్ధంచేత పుట్టిన పణ్ణా నదీతీరంలోని సాంద్రమైన చెరకువలె భోగ్యుడై ఉండేవాడు) అని అన్నారు. "అముదమ్" అని ఆళ్వారులు పలికిన దానిని దృష్టిలో పెట్టుకొని, దేశికులు "చెరకు" అని అన్నారు. దీనివల్ల పరమ భోగ్యత చెప్పబడింది. "అడియవర్ కట్కు ఆరముదమానాన్ తన్నై " అనే పాశురంలోనే "కుழா వరివండిశై పాడుమ్ పాడల్ కేట్టు తీంగరుంబు కణ్ వళరుమ్ కழని శూழ்న్ద" (శ్రేష్ఠమైన తుమ్మెదలు పాడే పాటలను విని, తీయని చెరకు కణుపులు పెరిగే క్షేత్రాలను చుట్టూ కలిగిన) అనే సూక్తిని దృష్టిలో పెట్టుకొని దేశికులు ఈ విధంగా అనుగ్రహించారు.

"అడియవర్ కట్కు" అనే ప్రయోగాన్ని నిశితంగా గమనిస్తే, తిరుమంగై మన్నన్ ఇక్కడ ఈ ముగ్గురు ఆళ్వార్లను ఉద్దేశించి పలికారు— అని ఏర్పడుతుంది. "అడియవన్, అడియవర్, అడియవర్ కళ్" అని ఇక్కడ మూడు విధాలుగా చెప్పే అవకాశం ఉండడం గమనించాలి.

తిరుమంగై మన్నన్ ఈ విధంగా పరోక్షంగా కాకుండా ఈ ముగ్గురి నామాలను స్పష్టంగానే నిర్దేశించి, పాశురాన్ని పాడి ఉండకూడదా? అని కొందరు సందేహపడవచ్చు. స్పష్టంగా, వాచ్యంగా పలకడం కంటే, ఈ విధంగా ధ్వనించేటట్లుగా పలకడం చాలా హృద్యం. శ్రీయామునులు నమ్మాళ్వారులను స్తుతించాలని ఆరంభించి, "మాతా పితా యువతయః " అనే శ్లోకంలో వారి పేరునే ప్రస్తావించలేదు. ఒక విధంగా చూస్తే, ఆ శ్లోకం భగవంతుని గూర్చినదేనా! అనేటట్లు ఉంటుంది. అయినప్పటికీ కూడా, వకుళాభిరామమ్" అనే ఒక విశేషణ స్వారస్యంచేతనే ఆ శ్లోకం నమ్మాళ్వారుల విషయమైనది— అని నిర్ణయింపబడుతున్నది. ఈ విధంగా, సూక్ష్మంగా గమనించి

తెలిసేటట్లు పలకడం చెప్పేవాని గాఢమైన జ్ఞానం, సామర్థ్యం అనే వీటిని సూచిస్తుంది, అంతేకాక, ఆళ్వారుల భక్తి సాంద్రతను కూడా తెలుపుతుంది.

అల్పిశి మాసం శ్రవణా నక్షత్రంలో కాంచీపురం దగ్గరలో ఉండే తిరువెక్కా లో శ్రీయథోక్తకారిస్వామి సన్నిధి పుష్కరిణిలో సరోయోగి అవతరించారు. వీరు అనుగ్రహించిన దివ్య ప్రబంధం వంద పాశురాలను కలిగిన ముదల్ తిరువందాది. అల్పిశి మాసం ధనిష్ఠా నక్షత్రంలో తిరుక్కడల్ మల్లై (మహాబలిపురం) లో పూదత్తాళ్వారులు అవతరించారు. వీరు నూరు పాశురాలను కలిగిన ఇరండామ్ తిరువందాది అనే ప్రబంధాన్ని అనుగ్రహించారు. అల్పిశి మాసం శతభిషా నక్షత్రంలో "మాడ మామయిల్ "అని కీర్తింపబడే మయిలాపురిలో పేయాళ్వార్లు అవతరించారు. వీరు అనుగ్రహించిన దివ్య ప్రబంధం నూరు పాశురాలను కలిగిన మూన్డామ్ తిరువందాది అనే ప్రబంధం.

ముదలాళ్వార్ తిరువడిగళే శరణమ్

# భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ

(కాంచి మహావిద్వాన్, ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యస్వామివారి "శ్రీమద్వరవరమునివర్య సిద్ధాంతసారమ్" అనే గ్రంథంనుండి)
ఈ. ఏ. శింగరాచార్యదాసుడు

"ఏ విధంగా అయినా భగవంతుని గుణవైలక్షణ్యంలోనే దృష్టి" అనేదే సదాచార్యసిద్ధాంత సారం– అని తెలుసుకోవాలి. ఇదే ఈ సంప్రదాయానికి బీగంవంటిది. ఇతర మతాలవారిలో నజీవునకే ఆధిక్యం చెప్పబడిందని తెలుస్తుంది. మన సంప్రదాయంలో మాత్రం, ఆ విధంగా కాకుండా, భగవంతునకే పూర్తిగా ఆధిక్యం చెప్పబడినదని స్పష్టపడుతుంది. ఈ విషయాన్ని వివరిస్తాను.

భగవద్గీతలోని (10–10) " తేషాం సతతత యుక్తానాం భజతాం ప్రీతి పూర్వకమ్, దదామి బుద్ధియోగం తం యేన మాం ముపయాంతి తే "అనే గీతాచార్య వరప్రసాదరూపమైన శ్లోకంలో " ప్రీతి పూర్వకమ్" అనే పదాన్ని దానికి ముందు ఉండే "భజతామ్" అనే పదంలో అన్వయించి, " ప్రీతి పూర్వకం భజతాం" – ప్రీతితో నన్ను భజించేవారికి –అని ఆది శంకరులు వ్యాఖ్యానించారు. భగవద్రామానుజులు ఆ విధంగా కాకుండా, " ప్రీతి పూర్వకం "అనే పదాన్ని తరువాత ఉండే "దదామి" అనే పదంలో అన్వయించి, "వారికి నేను మనస్సులో ఆనందించి ఇస్తాను" అని వ్యాఖ్యానించారు. శంకరులు చూపిన అన్వయం కంటే శ్రీరామానుజులు చూపిన యోజనలో ఉండే స్వారస్యాన్ని తాత్పర్య చంద్రికలో వివరించే దేశికులు " వెఱిదే అరుళ్ శెయ్ వర్ శెయ్ వార్ కట్కు "అనే తిరువాయ్ మొழி సూక్తిలో ఆళ్వారులు "ఉగందు" అని అనుగ్రహించడాన్ని మనసులో పెట్టుకుని, రామానుజులు ఈ విధంగా అన్వయించారు– అని అనడానికి ఈ సంస్కృత గ్రంథం స్థానం కానందున, ఆ సూక్తి నుండి ఫలించిన అర్థాన్ని మనస్సులో పెట్టుకొని, "ప్రీతిపూర్వక మిత్యస్య భజనాన్వయే ప్రయోజనం మందమ్. దదామీత్యన్వయే తు పరమోదారత్వమితి భగవద్గుణగణ ప్రకాశనేన మహత్

ప్రయోజనమ్– ఇత్యభిప్రాయేణ ప్రీతి పూర్వకం దదామీతి అన్వయః ఉక్తః" అని అనుగ్రహించారు. ఈ అభిప్రాయాన్ని పురస్కరించుకున్నవే, మన సత్సంప్రదాయార్థాలు, అనుష్ఠానాలు కూడా. దీనికి ఒక చిన్న ఉదాహరణను చూపిస్తాను. ఈ సంప్రదాయస్థులు "భగవంతునకు ఒకసారి నమస్కారం చేయాలి" అని, ఇతరులు "పలుమార్లు నమస్కారం చేయాల"ని చెప్పబడడం ప్రసిద్ధం. భగవంతుని నమస్కరించడం అనేది చాలా గొప్పదైన ఒక కార్యమే. దీనిని ఒక ఒకసారికి పలుమార్లు చేస్తే మంచిది కాదు– అని ఎవరైనా భావించగలరా? నమస్కరించేవాని ఇంద్రియాలు కూడా సుప్రసన్నం కావడానికి సాధనమైన కార్యం కదా, ఇది. ఈ విధంగా ఉండగా, ఒకసారి మాత్రమే నమస్కారం చేయాలి– అని ఒక వ్రతంగా గ్రహించవలసిన ఆవశ్యకత ఏమున్నది? అని వివేకి అయినవానికి ప్రతి ఒక్కనికి సందేహం కలుగుతుంది. నిజమే. ఈ సందేహం కలుగవలసినదే.

దీనికి తెన్నాచార్య సంప్రదాయస్థుల అభిప్రాయం ఏమిటో తెలియజేస్తాను, వినండి. మనలను చూస్తే, మనం ఎన్నిసార్లు నమస్కరించినా చాలదు. భగవంతుని గమనిస్తే, ఒక్కసారి నమస్కరించడం కూడా అధికమే. భగవంతుడు గీత మొదలైన వాటిలో తనను అల్పసంతుష్టునిగా నిర్దేశించుకున్నాడు. "పత్రం పుష్పం ఫలం తోయమ్ " అని మొదలుగా ఆ స్వామి పలికిన పలుకులు అమృత వచనాలు కదా. అన్య దేవతలు చాలా శ్రమపడి ఆదరింపబడవలసినవి అని, భగవంతుడు ఆరాధనకు చాలా సులభుడు అని ప్రసిద్ధం. ఆళ్వారులు భగవంతుని గొప్పతనాన్ని గూర్చి పలికేటప్పుడు "తొழுదు మామలర్ నీర్ శుడర్ దూపమ్ కొండు ఎழுదు మెన్ను మిదు మిక్తై" అని, " తొழு క్కరుదువదే తుణినదు శూదే" అని ఈ విధంగా ఈ అర్థాన్ని తెలియజేశారు.

"భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ" అనే ఉపనిషత్ వాక్యానికి " తే భూయిష్ఠాం నమ ఉక్తిం విధేమ" అనే అన్వయాన్ని చూపించి, "నమః అని నోటితో చెప్పడం కూడా

భగవంతుని అభిప్రాయం ప్రకారం చాలా ఘనమైనది అవుతుంది" అని మన పెద్దలు అర్థం తెలియజేశారు. భట్టర్ "అంజలి భరం వహతే" అని అన్నారు. మనం ఒక అంజలి చేసినప్పటికీ, అది భగవంతుడు చాలా పెద్ద భారంగా తోస్తుంది– అనేదానిని ఈ సూక్తితో చక్కగా వారు తెలియజేశారు. అందుచేత, ఆరాధనకు సులభుడయిన భగవంతుని ముందు మనం పలుమార్లు పడి నమస్కరిస్తే, అతని మనస్సు ఏమవుతుందో! నన్ను కూడా మిగిలిన దేవతల వలె భావించినట్లున్నాడే! అని అతని మనస్సు పుండు పడుతుందో! ఏమో! అని భయపడి ఆరాధనకు సులభుడు అనే అతని గొప్పతనానికి కొరత రాని విధంగా నడుచుకుందాం– అని భావించి, తెన్నాచార్యులు నమస్కారంలో ఆవృత్తిని సహించడం లేదు.

ఒక్కసారి నమస్కరించడం– అనే ఈ విషయంలో శాస్త్రసరణిలో తెలియజేయవలసిన విషయాలు చాలా ఉన్నాయి. వాటిని తరువాత తెలియజేస్తాను. తెన్నాచార్య సంప్రదాయం ముఖ్యంగా ఏ మూలాన్ని అనుసరించి నిలచి ఉన్నది– అనే విషయాన్ని మొదటిలోనే దృఢంగా చెప్పడం కోసమే ఈ విషయం మొదటగా ప్రస్తావింపబడింది. మనం చేతనులుగా పుట్టిన వ్యత్యాసానికి అయి తగినట్లుగా, ఏదో చైతన్యకార్యంగా స్వల్పం చేయవలసిన బాధ్యతను కలిగి ఉన్నాము. కానీ, ఇది కార్యకరమే కాదు. ఆ భగవంతుని మనస్సులోని కృపయే కార్యకరం. అది మన ఆకించన్యం, అనన్యగతిత్వం మూలంగా కలుగవలసినది. మన ఆకించన్యానికి వ్యతిరేకంగా అధికమైన ప్రయత్నాలను మనం చేస్తే, మనం ఏదో ఉపాయానుష్ఠానం చేస్తున్నట్లుగా భావించి, భగవంతుడు మనలను రక్షించే తన ప్రయత్నాన్ని విరమించవచ్చు. ఆ విధంగా అతడు ఉదాసీనుడై ఉండడానికి మనం అవకాశం ఇవ్వకూడదు.

ఇక్కడ దీనికి పిమ్మట ఒక సందేహం కలుగవచ్చు. భగవంతుడే స్వయంగా శాస్త్రాలలో ఉపాయాలను అనుష్ఠించమని వ విధించాడు కదా. మరి వాటిని చేస్తే ఏమి

తప్పు? అవి చేయవలసినవే కదా! అని ఇతరులు సందేహించవచ్చు. తెనన్నాచార్యులు ఆ విధంగా భావించరు, " నెఱి కాట్టి నీక్కుదియో? " (అన్యోపాయాలను చూపించి మమ్ములను నీకు దూరం చేస్తావా?) అని నమ్మాళ్వార్లు అనుగ్రహించిన విధంగా, తనకు దూరం చేయడంకోసం, మనలను పరీక్షించడం కోసంగా అతడు చూపిన దారులలో మనం ప్రవర్తించి బాధపడకూడదు. " కామ్బఱత్తలై శిరైత్తు ఉన్ కడైత్తలై ఇరుందు వాழ్రుమ్ శోంబరై ఉగత్తి పోలుమ్ శూழ్ పునల్ అరంగత్తానే" (కావేరీ నదిని చుట్టూ కలిగిన శ్రీరంగంలో నివసించే శ్రీ రంగనాథా! నీ సన్నిధానంలోనే పడి ఉండి, తన రక్షణ కోసం ఏ ప్రయత్నాన్ని చేయని సోమరివారిని చూచి నీవు ఆనందిస్తావు) అని తొండరడిప్పొడి అళ్వార్లు పలికిన విధంగా భగవంతుడు మనలను తప్పక రక్షిస్తాడు, మనం చేసే ఏ ఉపాయం కూడా మనకు రక్షకం కాదు" అనే స్థిరమైన నమ్మకంతో ఉండడమే తగినది– అనే నిశ్చయాన్ని తెన్నాచార్యులు మనసులో దృఢంగా కలిగి ఉంటారు.

నంబిళ్ళై అనుగ్రహించిన దివ్య సూక్తులలో ఒకటి రెండు సూక్తులను ఇక్కడ ప్రస్తావించి ఈ విషయాన్ని మనస్సులో పడేటట్లుగా చేస్తాను. తిరువాయ్ మొழி ప్రబంధంలో "పత్తుడై అడియవర్ క్కెళియవన్ పిఱర్ కట్కు అరియ విత్తగన్" అనే సందర్భంలో ఈడు వ్యాఖ్యానంలో "మనవారు భగవంతుని ఉపాయంగా ఆశ్రయించి ఉండగా, మిగిలినవారు అచేతన కార్యకలాపాలను ఆశ్రయించేటట్లుగా కదా దుర్యోధనుని స్థితి" అనే సూక్తి ఉన్నది. దీనివల్ల మనవారి స్థితి ఏమిటో, మిగిలినవారి స్థితి ఏమిటో తెలియవచ్చు. ఈ దశకానికి తరువాత దశకంలో తిరువాయ్ మొழி ప్రబంధంలో "ఎన్ పిழைత్తాళ్ తిరువడియిన్ తగవినుక్కు?" (1–4–7) అనే సందర్భంలో ఈడు వ్యాఖ్యానంలో "తమ కృపకు ఆటంకంగా ఏదైనా ప్రదక్షిణ నమస్కారాదులను పరాంకుశనాయకి చేసిందా?) అని నంబిళ్ళై అనుగ్రహిస్తారు" అని ఉన్నది. ఈ సూక్తులను జాగ్రత్తగా విమర్శించి చూడాలి. భగవంతుని విషయంలో దౌత్యాన్ని పంపే ప్రకరణం ఇది. " ఏమి తప్పు చేసినట్లుగా నీవు ఉపేక్షించావు? అని

అడగండి" అని మాత్రం ఇక్కడ మూలంలో ఉన్నది. " మేము ఏదైనా ప్రదక్షిణ నమస్కారాలను చేసినట్లుగా భావించి ఉపేక్షిస్తున్నావా ?అని అడగండి" అని ఇక్కడ నంబిళ్ళై వివరణాన్ని అనుగ్రహించారు. ఇందుచేత ప్రదక్షిణ నమస్కారాలను చేయడం భగవంతుని కృపకు ప్రతిబంధకం— అని స్పష్టంగా ఏర్పడుతున్నది. ఈ విధంగా పలికిన నంబిళ్ళై భగవత్సన్నిధిలో ప్రదక్షణ నమస్కారాదులు చేసి ఉండరా? చేయరు— అని అంటే దీనిని ఎవరైనా నమ్మడానికి వీలవుతుందా? అది శాస్త్రార్థం అవుతుందా ? మరి ఎందుకోసం నంబిళ్ళై ఈ విధంగా వివరించారు? అని వివేకం కలిగినవారు విమర్శించి చూడాలి కదా. విమర్శిస్తే, చేతనుని అధిక ప్రవృత్తి దోషం అవుతుంది— అనే అంశమే ఇక్కడ స్పష్టపడుతుంది.

శిఱియ తిరుమడల్ ప్రబంధంలో. "శెంగుఱింజి తారార్ నఱుమాలై శాత్తఱ్కు త్తాన్ పిన్నుమ్ నేరాదన వొన్ఱు నేర్ న్దాళ్" అనే సందర్భంలో పెరియ వాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యాన సూక్తిని కలుపుకుని, ఇంతకు ముందు ప్రస్తావించిన నంబిళ్ళై సూక్తికి అర్థం వివరించినప్పుడు, తెన్నాచార్యుల అభిప్రాయం చక్కగా స్పష్టపడుతుంది. ఉపాయకోటిలో స్వల్పమైనా అన్వయించకుండా, స్వరూపంలో మాత్రమే నిలిచేటట్లుగా కొన్ని ప్రయత్నాలను చేయడమే తగినది. ఏదైనా అధికంగా ప్రయత్నాన్ని చేస్తే, అది ఉపాయ కోటిలోనికి అన్వయించి, మన ఆకించన్యాన్ని నశింపజేసి, భగవంతుని మనస్సుకు అభిప్రాయానికి ఆటంకంగా నిలుస్తుందా? అనే అతిశంక వీరికి ఉన్నదనే విషయం స్పష్టమవుతున్నది. ఏ విషయంలో అయినా శాస్త్రాలు ఒకేదారిని చూపించవు. పలు విధాలయిన మార్గాలను అవి తెలియజేస్తాయి. ఒక్కొక్క అధికారి ఒక్కొక్క దారిని ఆశ్రయించి ప్రవర్తించడం సహజం. ఈ ఈ గ్రంథంలో ముందుగా ముఖ్యంగా ఆరంభించిన ఈ విషయం పూర్తి చేయబడుతున్నది. ఏ విధంగా అయినా, చేతన ప్రవృత్తికి ఆధిక్యం కలగాలి— అనేది ఇతరుల అభిప్రాయంలోని సారం— అని, భగవంతుని గుణాధిక్యం ప్రకాశించే మార్గంలో ఊనికను కలిగి ఉండడమే తెన్నాచార్యుల అభిప్రాయసారమని ఇంతవరకు తెలియజేసినట్లయినది.

*"ఒకేసారి నమస్కారం చేయాలి" అనే విషయాన్ని వివరించడం*

సారంగా వినండి. పూర్వం వివరించినట్లుగా, సత్సంప్రదాయంలో ఒకసారి నమస్కారం చేయడం అనేది ఒకటి ఉన్నది. పలుమార్లు నమస్కారం చేయడం వల్ల ఏమీ విరోధం ఉన్నది? నమస్కారం అనేది మంచి కార్యమే తప్ప, చెడ్డ పని కాదు కదా. భగవద్భాగవత విషయంలో ఒకసారికి పలుమార్లు నమస్కరించడం వల్ల స్వరూపం ప్రకాశిస్తుందే తప్ప, చెడిపోదు కదా, అందుచేత, ఒకసారే నమస్కరించాలి { నిర్బంధాన్ని పెట్టుకోవాలా? పలుమార్లు నమస్కరించకూడదు– అని శాస్త్రం నిషేధిస్తుందా? ఆ విధంగా నిషేధిస్తున్నట్లుగా ఎక్కడ కనపడలేదే! శరీరంలో శక్తి లేనివారు ఒకసారి గాని, లేక, దాంట్లో సగంగాని నమస్కరించవచ్చు. శక్తి, ఉత్సాహం ఉన్నవారు పలుమార్లు నమస్కరిస్తే, దానిని దోషంగా చెప్పేటట్లు ఒక సంప్రదాయం ఉండవచ్చునా? అని ఈ విధంగా సందేహాలు కలుగుతాయి. ఈ విషయంలో మన పూర్వాచార్యుల అభిప్రాయాన్ని ఇంకా విశదంగా తెలియజేస్తాను, వినండి. ఏ విషయంలో అయినా శాస్త్రాల దృష్టి ఉచ్చావచంగానే ఉంటుంది.

" మఱైప్పాల్ కడలై త్తిరునావిన్ మందత్తాల్ కడైందు" (శాస్త్రం అనే పాల సముద్రాన్ని జిహ్వ అనే మందర పర్వతంలతో చిలికి) అనే విధంగా పలు శాస్త్రాలనే సముద్రాన్ని చక్కగా మథించి, సూక్ష్మమైన అర్థాలను గ్రహించిన పరమాచార్యులు దర్శించిన అనుష్ఠానమే పరమశాస్త్రం. సకృత్ ప్రణామ విషయంలో ఏమి సూక్ష్మమైన అర్థం దర్శించడానికి సాధ్యమవుతున్నది? అని అంటే, వినండి. నమస్కారంలోని ప్రయోజనం ఏమి? అనే విషయాన్ని ముందుగా విమర్శిద్దాం. " నంతౄనంతవ్యభావోఽయం న ప్రయోజన పూర్వకః, నీచోచ్చయోః స్వభావోఽయం నంతౄనంతవ్యతాత్మకః" అనే ఆహిర్బుధ్న్యసంహితా వచనాన్ని దేశికులు మొదలైనవారు ఉదాహరించారు. పెద్దవారిని చూస్తే చిన్నవారు తమ చిన్నతనానికి విరుద్ధమైన గొప్పతనాన్ని చూస్తే, వెంటనే నమస్కారం చేయాలి– అనేది, తప్ప వేరొక ప్రయోజనం ఏమీ దీనికి లేదు –అని ఈ శ్లోకం చెబుతున్నది. ఒకసారి నమస్కరించడం మాత్రంతో తన తక్కువదనం, ఇతరుల

ఉత్కర్షం ప్రకటింపబడింది. పలుమార్లు నమస్కరించాలి అనే నిర్బంధానికి ప్రసక్తి లేదు— అనేది ముఖ్యమైన మొదటి విషయం.

శాస్త్రాలలో ఒంటి చేత్తో నమస్కరించడం అపచారం. ఒక ప్రదక్షిణం చేయడం అపచారం— అని చెప్పినట్లుగా, ఒకసారి నమస్కరించడం అపచారం అని చెప్పబడలేదు. ఏకేన పాణినా యస్తు ప్రణమేత్ పురుషోత్తమమ్, న్యాయ్యః తస్య కరచ్ఛేదః ఇతి వేదవిదో విదుః" అని, ఏక హస్తప్రణామాచ్చ ఏకంచాపి ప్రదక్షిణమ్" అని ఇటువంటి ప్రమాణాలనే స్తోత్ర భాష్యంలో శ్రీ దేశికులు ఉదాహరించడాన్ని గమనిస్తున్నాము.

శ్రీ భరతాళ్వాన్ చిత్రకూటానికి వెళ్లి శ్రీరాముని పాదుకలను పొంది, తిరిగి వచ్చే దారిలో భరద్వాజాశ్రమంలో దిగి, పాదుకా ప్రాప్తిని విజ్ఞప్తి చేసి, ఆ మహర్షి దగ్గర అనుమతిని పొందాలని భావించి, ఆ మహర్షిని నమస్కరించి, ప్రదక్షిణ చేసి, బయలుదేరాడు —అనే విషయాన్ని శ్రీరామాయణంలో అయోధ్యాకాండలో నూట పదమూడవ సర్గలోని 18 19 శ్లోకాలలో చెప్పేటప్పుడు " ఆమంత్రయిత్వా మారేభే చరణౌ ఉపగృహ్య చ, తతః ప్రదక్షిణం కృత్వా భరద్వాజం పునః పునః" (భరతుడు భరద్వాజుని నమస్కరించి, అనేక పర్యాయాలు ప్రదక్షణంచేశాడు) అని చెప్పబడింది. అక్కడ వ్యాఖ్యానం చేసిన గోవిందరాజులు నమస్కారం ఒకసారి చేసే సంప్రదాయం, ప్రదక్షిణం అనేకమార్లు చేసే సంప్రదాయం ఇక్కడ చక్కగా స్పష్టం చేయబడినవి —అని అర్థం వచ్చేటట్టు సంస్కృత భాషలో వివరించడాన్ని అందరూ చూడవచ్చు.

భగవద్రామానుజులు శ్రీ వైకుంఠ గద్యలో" ప్రణమ్య ఉత్థాయోత్థాయ పునః పునః ప్రణమ్య" (నమస్కరించి లేచి మళ్లీ మాటిమాటికి నమస్కరించి అనే పలికిన విషయంలో కష్టపడుతున్నది ఇక్కడ "ప్రణమ్య ఉత్థాయోత్థాయ పునః పునః ప్రణమ్య" అని ఒక చోటనే పలుమార్లు నమస్కరించడం చెప్పబడలేదు. ఆ వాక్యానికి ముందు కూడా,

"దూరాదేవ" అని చెప్పినందున, భగవంతుని దగ్గరకు వచ్చేవరకు కాలితో నడిచి వెళ్లకుండా, దండం పెడుతూనే దారిలో వెళ్లి, శ్రీమన్నారాయణుని సమీపించినట్లుగానే అక్కడ అర్థం వస్తున్నది. ఈ కాలంల ఇపుడు అనేకమార్లు ప్రణామం చేసేవారు చేసేటట్లుగా ఉండే కార్యం అక్కడ వివక్షితం కాదు. నమస్కారం సమర్పిస్తూనే పోయి, దారిని దాటి, భగవంతుని దగ్గరకు వెళ్ళిన తర్వాత, అక్కడ ఒకేసారి నమస్కరించడం అనేది అక్కడే మళ్ళీ చెప్పబడి ఉండడాన్ని "యాచమానః ప్రణమ్య ఆత్మానం భగవతే నివేదయేత్" అనే ఆ వాక్యం చివర ఉండడం గమనించవచ్చు ఈ విధంగా కాకుండా ఒక్కచోటలోనే నిలచి ఉంది అనేకమార్లు నమస్కరించడమే "ఉత్థాయోత్థాయ పునః పునః ప్రణమ్య" మీ వాక్యం చెబుతున్నది అని చెప్పినప్పటికీ ఏ కొరత లేదు హశాస్త్రం దైవ చక్ర మహా అనేది శాస్త్రక్రమానికి లోబడని ఆవిభూతిలో ఆ విధంగా సంభవించడాన్ని పురస్కరించుకొని ఏమి సాధించడానికి వీలవుతుంది ఈ చోట మన పూర్వాచార్యుల అనుష్ఠానం ఒకేసారి నమస్కరించడమే అనే సంగతిని ఆ రామానుజులు తామే స్పష్టంగా స్కూపిన రీతిని గమనించండి మహాచార్యులు ఆరాధన క్రమాన్ని అనుగ్రహించిన నిత్య గ్రంథంలో "ఆరాధనాభిముఖో భవేతి మూలమంత్రణ ప్రార్థ్య, మూలమంత్రేణ న దండవత్ ప్రణమ్య ఉత్థాయ, స్వాత్మానం నివేద్య, యావదారాధనసమాప్తి సాన్నిధ్యయాచనం కుర్యాత్" అని ఒక్కసారి నమస్కరించడం— అనే విషయాన్ని తెలుపడం ప్రసిద్ధం కదా. దీనితో శ్రీ వైకుంఠ గద్యలోని శ్రీ సూక్తి భావాన్ని మనం పూర్వం వివరించిన రీతిలో గ్రహించడం తగినది.

భగవద్రామానుజులు మొట్టమొదటగా తిరుక్కోట్టియూర్ కు వెళ్లినప్పుడు ఒక చోట నిలిచి, అక్కడ ఉండే ఒకరిని చూసి, నంబి గృహం ఎక్కడ ఉన్నది? అని ప్రశ్నించగా, వారు ఆ వీధి చివర ఉండే నంబి గృహాన్ని చూపించగా, శ్రీ రామానుజులు అక్కడ నుండి పాదాలతో నడచి అక్కడికి వెళ్లకుండా, ప్రణామ పరంపరను చేస్తూ నంబి గృహానికి చేరారు —అని అంటారు, పెద్దలు. ఇక్కడ ఈ విధమైన ప్రక్రియయే వైకుంఠ గద్యలో చెప్పబడిందని తెలియాలి.

ఆళవందార్ స్తోత్ర రత్నంలో 21వ శ్లోకంలో "నమో నమః నమో నమః" అని పలుమార్లు పలకడాన్ని సమన్వయం చేయాలని భావించిన దేశికులు ఆ సందర్భంలో స్తోత్ర రత్న భాష్యంలో "ప్రశంసాయాం ప్రతిజ్ఞాయాం ప్రలాపే తర్జనేపి చ, భయే చ విజయై చైవ పౌనఃపున్య మలంకృతిః" అనే ఒక శ్లోకాన్ని ప్రస్తావించారు. ఆ శ్లోకంలోని అర్థాన్ని వివేకం కలిగినవారు గమనించాలి. స్తోత్రం చేయడం, రోదించడం, బెదరించడం, భయపడుతూ చెప్పడం, విజయం ప్రకటించేటట్లు చెప్పడం మొదలైన సందర్భాలలో ఒకే మాటను మాటిమాటికి చెప్పడం ఒక విధమైన అలంకారం అవుతుంది– అనేది ఈ శ్లోకంలోని అర్థం> లోకంలో దీనిని మనం బాగా గమనిస్తున్నాము. " పాము పాము పాము "అని పలుమార్లు చెప్పినా, అక్కడ ఉన్నది ఒకే పాము తప్ప, ఎన్నో పాములు లేవు కదా. పల్లాండు పల్లాండు పల్లాయిరత్తాండు పల కోటి నూఱాయిరమ్" అని వందల వేలు సార్లు చెప్పినా " విజయీభవ " అని ఒక మారు చెప్పడానికి ఏమి అర్థమో, అదే అర్థం కదా ఏర్పడుతుంది. ఆ విధంగానే, నమో నమః, తొ ్రుదు తొ ్రుదు" అని ఎన్నిసార్లు చెప్పినా, అలంకారమే అవుతుంది– అని దేశికులు తామే స్పష్టంగా నిర్ణయించిన తరువాత, అర్థనిర్వాహంలో మనకు ఏమి శ్రమ ఉన్నది?

ఇక్కడ ఇంకొక దేశిక సూక్తిని ప్రస్తావించి ఈ విషయాన్ని పూర్తి చేస్తా. బేసికులు అభయ ప్రదాన సారం ఆరంభంలో అనుగ్రహించిన ఈ శ్లోకాన్ని గమనించండి.

"పాయః ప్రపదనే పుంసాం పౌనఃపున్యం నివారన్, హస్తః శ్రీరంగభర్తుర్మాం మవ్యా దభయముద్రితః" అనేది ఆ శ్లోకం. ఆరంభించే టప్పుడే ప్రాయః అని అన్నందున ఇది కేవలం ఒక ఉత్ప్రేక్ష అనేది స్పష్టపడుతుంది. " మన్యే శంకే ధ్రువం ప్రాయో నూనమిత్యేవమాదిభిః, ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దైః ఇవ శబ్దో ౽ పి తాదృశః" అనేది ఆలంకారికుల కారిక కదా! సంభావితమైన ఉత్రేక్ష చెప్పబడుతుంది తప్ప, అసంభావితమైనది నిబంధింపబడదు కదా. ఇక్కడ ఏమి ఉత్రేక్ష చెప్పబడింది? అంటే,

ముందుగా కొన్ని లౌకిక వచనాలను వినండి. ఒక తదీయారాధన గోష్ఠి జరుగుతున్నది, లడ్డు వడ మొదలైన భక్ష్యాలను ఒకసారి పెట్టిన తరువాత, మళ్ళీ పెట్టడానికి వస్తే, ఆశ ఉన్నవారు అంగీకారాన్ని తెలిపేటట్లు ఉంటారు. ఆశ లేని వారు తమ నిరపేక్షను నిషేధాన్ని తెలిపే హస్తముద్రతోనే తెలియజేస్తారు. దానివల్ల వారి అభిప్రాయాన్ని తెలుసుకొని వడ్డించేవారు ముందుకు వెళతారు. దీనిని మనస్సులో పెట్టుకొని పైన చూపిన దేశికుల సూక్తికి అర్థాన్ని గ్రహించాలి. అభయ ముద్రతో కూడి ఉండే శ్రీరంగనాథుని కుడి చేయి "చాలు, చాలు" అనే అభిప్రాయాన్ని తెలియజేసేదిగా ఉన్నందున, దేనిని చాలు అని అంటున్నది? అనే ప్రశ్నను మనసులో పెట్టుకొని, స్వామి దేశికులు అద్భుతంగా పలుకుతున్నారు.

"పుంసాం ప్రపదనే పౌనః పున్యం నివారణయన్ హస్తః" — తన సమక్షానికి వచ్చి నమస్కరించేవారు ఒకసారికి మించి నమస్కరించడానికి ప్రయత్నం చేస్తే, ఆ ప్రయత్నాన్ని అడ్డుకునేటట్లుగా ఉన్నది, ఆ హస్తముద్ర. " నను ప్రపదనే" అనేదానికి "ప్రపత్తిలో" అనే అర్థమే తప్ప, నమస్కారంలో అనే అర్థం తగదు— అని అంటే, ఈ అర్థం ఇక్కడ సంభవించదు. హస్తముద్రతో నివారణ చేయదగినది ప్రవృత్తి రూపమైన కార్యమే తప్ప నివృత్తిరూపమైన కార్యం కాబోదు. భగవత్ ప్రవృత్తి నిరోధి స్వప్రవృత్తి నివృత్తిః ప్రపత్తిః" అని ప్రపత్తి లక్షణాన్ని మరువకూడదు. ద్రౌపది ప్రపత్తి చేసింది అంటే, ఆమె ఏమి చేసింది? ఇరు కైయుమ్ విట్టేనో, ద్రౌపదియై పోప్లే" అనే విధంగా చీరను లాగిపోవడం అనే స్వప్రవృత్తిలోనుండి విరమించింది. అదే ఆమె ప్రపత్తిగా చెప్పబడుతున్నది. గజేంద్రుడు చేసిన ప్రపత్తిని కూడా చూద్దాం. గజ ఆకర్షతే తీరే గ్రాహ ఆకర్షతే జలే " అనే విధంగా గజేంద్రుడు మసలిని తీరానికి లాగడానికి చేసే ప్రయత్నం నుండి విరమించడమే కదా అతడు చేసిన ప్రపత్తి— అని అంటున్నాము. పరమాపదమాపన్నో మనసా ౨ చింతయద్ధరిమ్" అని కదా ప్రమాణం చెబుతున్నది. అందుచేత ప్రపత్తి రూపం నివృత్తి రూపమే తప్ప, ప్రవృత్తి రూపం కాదు. అది కూడా న్యాసతిలకంలో "ఆర్తేషు ఆశుఫలా"అనే శ్లోకంలో

" త్వయ్యేవ త్వదుపాయధీః" అని శ్రీదేశికులు అనుగ్రహించినట్లుగా మానసికమే తప్ప కాయికం కాదు కదా. "ప్రపదనే" అనే పదంలో మూడవ అక్షరం తవర్గంలోని మొదటి అక్షరమే తప్ప మూడవ అక్షరం కాదు ("ప్రపతనే" అని కాదు) అనే విషయాన్ని సులభంగా గ్రహించవచ్చు.

# శతమూలా శతాంకురా

*(సంస్కృత వేదంలో ద్రావిడ వేదప్రశంస)*

(కాంచి మహావిద్వాన్, ప్రతివాదిభయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారు రచించిన, "ద్రవిడోపనిషత్ ప్రభావ సర్వస్వం" అనే ద్రావిడగ్రంథంనుండి స్వీకరింపబడి, ఆంధ్రీకరింపబడింది)
దాసుడు– ఈ, ఏ, శింగరాచార్యులు

"సహస్రపరమా దేవీ శతమూలా శతాంకురా,
సర్వం హరతు మే పాపం దూర్వా దుఃస్వప్న నాశినీ"

తైత్తిరీయోపనిషత్తులో కనిపించే ఈ వాక్యంలోని విశేషార్థాలను గమనించండి.

ఈ వాక్యంలో ఉండే "దేవీ "అనే పదానికి "స్తుతిరూపమైన వేదం" అని అర్థం. "దివు" అనే ధాతువు నుండి పుట్టిన పదం ఇది. "దివు– క్రీడా విజిగీషా వ్యవహార ద్యుతి స్తుతి మోదమద స్వప్న కాంతి గతిషు" అనే పది అర్థాలను కలిగినది, ఈ దివుధాతువు. స్తుతి అనే అర్థాన్ని ఈ పదం ముఖ్యంగా కలిగినది. మిగిలిన అర్థాలను కూడా యథావకాశంగా గ్రహించవచ్చు. ఈ వేదవాక్యంలో పైన "దూర్వా" అని చెప్పబడినది పచ్చదనం కలిగినది –అని దీని అర్థం. దివ్య ప్రబంధం "పశుమ్ తమిழ், ఈర త్తమిழ்" అని వ్యవహరింపబడుతున్నది. దీనికి ప్రతికోటిగా సంస్కృత వేదం శుష్కమని చెప్పబడుతున్నది. ఆ తాత్పర్యంలోనే "తెళియాద మఱైనిలమ్" అనే ప్రయోగాన్ని దేశికులు చేశారు. ఏదైనా పచ్చ పచ్చగా నవనవలాడుతూ ఉంటే, స్పృహణీయంగా ఉంటుంది. శుష్కంగా, ఎండిపోయినట్లు ఉంటే ఆకర్షణీయంగా ఉండదు. అందువల్ల ఇక్కడ "దూర్వా దేవీ" అనే ప్రయోగం ద్వారా నిత్యనూతనంగా భాసించే ద్రావిడవేదం సూచింపబడింది– అని భావించవచ్చు. ఇక్కడ ఇంకా ఉండే విశేషాలు ఈ అర్థాన్ని నిరూపిస్తున్నాయి. ఏ విధంగా? అంటే,

(సహస్ర పరమా) "సహస్రం పరమం యస్యాం సా సహస్ర పరమా" అనేది ఇక్కడ విగ్రహవాక్యం ఈ ద్రావిడవేదం ఒక వేయి పాశురాలను ముఖ్యంగా కలిగినది— అని అర్థం.

"ఋషిం జుషామహే కృష్ణతృష్ణాతత్వ మివోధితమ్,
సహస్రశాఖాం యో ౽ ద్రాక్షీత్ ద్రావిడీం బ్రహ్మసంహితామ్"

అనే భట్టర్ అనుగ్రహించిన శ్లోకంలోని అర్థం ఇక్కడ అనుసంధేయం. "వేదేషు పౌరుషం సూక్తమ్" అని వేదాలలో పురుష సూక్తం గొప్పది అయినట్లే, నాలాయిర దివ్యప్రబంధంలో నమ్మాళ్వారుల తిరువాయ్ మొ*ళ్హి* ప్రబంధమే పరమమని చెప్పదగినది, కనుక, "సహస్ర పరమా" అనే పదంచేత అదే తెలుపబడుతున్నది.

(శతమూలా) నూరు పాశురాలను మూలంగా కలిగినది— అని దీని అర్థం. " మాఱన్ విణ్ణప్పమ్ శెయ్ ద శొల్లార్ తోడైయిల్ ఇన్నూఱుమ్" అని చెప్పబడిన నమ్మాళ్వారులచే అనుగ్రహింపబడిన తిరువిరుత్తప్రబంధంలోని సహస్ర గాథాత్మకమైన తిరువాయ్ మొ*ళ్హి* ప్రబంధానికి మూలం— అని అర్థం. తిరువిరుత్తంలోని నూరు పాశురాలే తిరువాయ్ మొ*ళ్హి* ప్రబంధంగా విస్తరించింది— అనే ఆచార్యహృదయగ్రంథంలోని నిర్వాహం దీనిని అనుసరించినదే.

(శతాంకురా) ముదలాల్వార్లు అనుగ్రహించిన నూఱు నూఱు పాశురాల రూపంలో ఉండే మూడు దివ్యప్రబంధాలనుండే మిగిలిన దివ్యప్రబంధాలు అవతరించినందున, నూఱు పాశురాలను కల దివ్యప్రబంధాలను అంగంగా కలిగిన ఈ ద్రావిడవేదం —అని అర్థం.

ఈ ప్రయోగాన్ని ఇంకొక విధంగా కూడా పెద్దలు వివరిస్తారు. ఇరామానుశ నూత్తందాది ప్రబంధాన్ని దృష్టిలో పెట్టుకొని "శతాంకురా" అని ప్రయోగింపబడింది—

అని అంటారు. " తమిழ் మఱైకళ్ ఆయిరముమ్ ఈన్ఱ ముదల్ తాయ్ శడకోపన్ మెయ్ మ్మ్బాల్ వళర్ త్త ఇద త్తాయ్ ఇరామానుశన్" (ద్రావిడ వేదమైనవేయి పాశురాలను అనుగ్రహించిన కన్నతల్లి శఠకోపులు, దానిని చక్కగా అభివృద్ధి చేసిన హితపరురాలైన పెంపుడు తల్లి శ్రీరామానుజులు) అని శ్రీపరాశరభట్టర్ అనుగ్రహించినట్లుగా, దివ్యప్రబంధప్రకాశానికి భగవద్రామానుజులే అంకురభూతులు కనుక, వారి ఔన్నత్యం వారి స్తుతిరూపమైన నూత్తందాదిలో చెప్పబడింది– అని భావం. ఇదే మిక్కిలి ఉత్తమమైన సమన్వయం. అందుచేత తిరువిరుత్తాన్ని, ఇరామానుశనూత్తందాదిని గొప్ప అవయవాలుగా కలిగిన తిరువాయ్ మొழி సహస్రాన్ని శిఖరంగా కలిగిన, పచ్చగా ప్రకాశించే ద్రావిడ వేదం– అని చెప్పినట్లయినది. దీని గొప్పతనం ఎటువంటిది ?అంటే,

(దుఃస్వప్ననాశినీ) " ఊమనార్ కండ కనవిలుమ్ పழுదా యొழிన్దన" (మూగవాడు కన్న కలలు కంటే కూడా వ్యర్థంగా అయిపోయింది) అని తిరుమంగై మన్నన్ పలికిన విధంగా చెడ్డకలలతో సమానమైన జనిపథపరివృత్తిని, అంటే, సంసారాన్ని నాశనం చేస్తున్నది– అని అర్థం. దివ్యప్రబంధానికి ఇదే వేకదా ఫలశ్రుతిగా ప్రతి దశకంలోనూ కనిపిస్తుంది. " శన్మమ్ ముడివెయ్ ది నాశమ్ కండీర్ కళ్ ఎంగానలే" (జన్మ నశించిపోయి, ఎండమావువంటి సంసారం నశించిపోతుంది, ఇది నిశ్చయం) అనే తిరువాయ్ మొழி పాశురం ఇక్కడ ముఖ్యంగా అనుసంధేయం. ఇటువంటి ద్రావిడ వేదం,

(మే సర్వం పాపం హరతు) తత్త్వహితపురుషార్థాలను యథాతథంగా తెలియడానికి అడ్డంగా ఉండే అజ్ఞానాన్యథాజ్ఞానాదులకు హేతువులైన సకలపాపాలను పోగొట్టుగాక –అని ప్రార్థించినట్లయినది.

ఇది సంస్కృత వేదంలో ద్రావిడ వేదం కీర్తించిన సూక్తిప్రకారం.

# భగవత్కటాక్ష వీక్షణమహిమ

(కాంచి మహావిద్వాన్, ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్య స్వామివారు అనుగ్రహించిన ద్రావిడవ్యాసం ఆధారంగా)
దాసుడు ఈ. ఏ. శింగరాచార్యులు.

భగవంతుని దివ్యాంగాలలో ఏ అవయవం మనకు చాలా ఉద్దేశ్యం అయినది? అని గమనించినప్పుడు, శ్రీచరణాలే శరణమని నిర్ణయించుకోవచ్చు. "అంజేల్ ఎన్ఱు కై కవియాయ్" (భయపడకు అని నీ అభయహస్తాన్ని చూపు) ప్రార్థించేటట్లు అభయ ముద్రతో కూడిన శ్రీహస్తమే రక్షకమని భావించవచ్చు. " విభోః నాభిపద్మం విధిశివనిదానం భగవతః తదన్యద్భ్రూభంగీపరవధితి సిద్ధాంతయతి నః" (బ్రహ్మకు, శివునకు మూలమైన ప్రభువైన శ్రీరంగనాథుని నాభిపద్మం ఆ భగవంతుని కంటే వేరైన, సమస్తమైన ఈ ప్రపంచం అతని కనుబొమల కదలికలను అనుసరించి వర్తిస్తున్నది– అనే విషయాన్ని సిద్ధాంతీకరిస్తున్నది) అని భట్టర్ అనుగ్రహించిన సూక్తికి మూలమైన "ముదలామ్ తిరువురువుమ్ మూన్ఱెన్బర్, ఒన్ఱే ముదలాగుమ్ మూన్ఱుక్కు మెన్బర్ ముదల్ వా! నిగరిలకు కారురువా! నిన్నగత్తదన్ఱే పుగరిలగు తామరైయిన్ పూ" (పెరియ తిరువందాది) (కొందరు– త్రిమూర్తులు ఈ లోకానికి మూలం– అని అంటారు. ఒకరే ఈ ముగ్గురికి మూలమని ఇంకా కొందరు అంటారు. జగత్కారణభూతుడవై, సాటి లేని ప్రకాశాన్ని కలిగిన నల్లని రూపాన్ని కలిగిన స్వామీ! మికిలిగా ప్రకాశించే నాభికమలం నీ తిరుమేనిలోనే ఉన్నది కదా) అనే నమ్మాళ్వారుల పాశురాన్ని అనుసరించి తిరునాభియే రక్షకమని కూడా భావించవచ్చు. కటాక్ష వీక్షణమే చాలా ముఖ్యమైనవని నిర్ణయించడంలో కూడా ఔచిత్యం ఉన్నది. " జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః, సాత్వికః స తు విజ్ఞేయః స వై మోక్షార్థచింతకః" (జన్మించే ఏ మానవుని మధుసూదనుడు కటాక్షిస్తాడో, అతడు సాత్వికుడు అవుతాడు– అని తెలియాలి. అతడే మోక్షపురుషార్థాన్ని గూర్చి ఆలోచిస్తాడు) అనే విధంగా మనం

జన్మించడానికి ముందే తల్లి గర్భంలోనే మనలను సంపదను కలిగినవారినిగా చేస్తాయి కదా భగవంతుని నే కటాక్షవీక్షణాలు.

నమ్మాళ్వార్లు తిరువాయ్ మొழி ప్రబంధాన్ని ఆరంభించేటప్పుడే "తుయరఱు శుడరడి తొழுదు ఎన్ మననే! " (భక్తుల దుఃఖాన్ని తీర్చే, ప్రకాశించే, భగవంతుని పాదాలను, ఓ మనసా! నమస్కరించు) అని తమ మనసును ఉద్దేశించి పలుకుతూ, దేవాధిదేవుని శ్రీచరణాలనే రక్షకంగా చూపించి, వానిని ఆశ్రయించమని పలికినప్పటికీ, తమ మొదటి ప్రబంధమైన తిరవిరుత్తప్రబంధంలో " పెరుమ్ కేழலార్ తమ్ పెరుమ్ కణ్ మలర్ పుండరీకమ్ నమ్మేల్ ఒరుజ్గే పిఱழవైత్తార్ ఇవ్వకాలమ్ ఒరువర్ నమ్ పోల్ వరుమ్ కేழంబవరుళరే" (మహా వరాహస్వామి వికసించిన పుండరీవంటి నేత్రాలతో కటాక్షాలను మన విషయంలో నిరంతరంగా ప్రకాశించేటట్లు ప్రసరింపజేశారు. ఈ సమయంలో మనవంటి ఈ కటాక్షానికి లక్ష్యమైనవారు ఇంకొకరు ఎవరైనా ఉన్నారా?) అని అంటూ ఆ స్వామియొక్క కటాక్షవీక్షణాలు మొదట తమకు ప్రాప్తం అయ్యాయని, అవే తమ క్షేమాలకు, అన్నిటికీ మూలకందమని పలకడానికి గమనిస్తాము. గోదాదేవి కూడా తిరుప్పావై ప్రబంధంలో " తింగళుమ్ ఆదిత్తియనుమ్ ఎழுన్దాఱ్పోల్ అంగణ్ ఇరండుమ్ కొండు ఎంగళ్ మేల్ నోక్కుదియేల్ ఎంగళ్ మేల్ శావమ్ ఇழన్దు" (చంద్రుడు, సూర్యుడు ఉదయించినట్లుగా ఉండే, అందంగా ఉండే నీ రెండు నేత్రాలతో మమ్మెలను కటాక్షిస్తే మా శాపం తీరిపోతుంది) అని పలికింది.

ఇతిహాస పురాణాలలోకి వెళ్లి గమనిద్దాం. "శ్రమణీం ధర్మనిపుణా మభిగచ్ఛ" (ధర్మాలలో నైపుణ్యాన్ని కలిగిన శబరి దగ్గరకు వెళ్ళు) అని కబంధుడు చెప్పిన తరువాత, " సో ऽ భ్యగచ్ఛన్మహాతేజా శబరీమ్" (గొప్ప తేజస్సును కలిగిన శ్రీరాముడు శబరి దగ్గరకు వెళ్ళాడు) అనే విధంగా శ్రీరాముడు తానే వెళ్లి అనుగ్రహించిన, వ్యాధకులానికి చెందిన శబరి " చక్షుషా తవ సౌమ్యేన పూతాస్మి రఘునందన! " (చల్లని నీ కటాక్షంతో రామచంద్రా! నేను పవిత్రతను పొందాను) అని అంటూ "తన

ప్రాప్తిప్రతిబంధకాలు అన్నీ నశించి, పరిశుద్ధతను పొందినదానిని అయ్యాను" అని శ్రీరాముడు ఆమెను తన కటాక్షాలతో అనుగ్రహించినప్పుడు కలిగిన గొప్పతనాన్ని తెలియజేసింది.

పాండవుల కోసం శ్రీకృష్ణుడు దూతగా వెళ్ళిన సమయంలో, "జలప్రవాహం పల్లంగా ఉండే చోటుకే ప్రవహిస్తుంది" అనే రీతిలో నివాసాయ యయౌ వేశ్మ విదురస్య మహాత్మనః" (శ్రీకృష్ణుడు మహాత్ముడైన విదురుని ఇంటికి విడిది కోసం వెళ్ళాడు) అనే విధంగా విదురుని ఇంటికి తానే వెళ్లి, " విదురాన్నాని బుభుజే శుచీని గుణవంతి చ" (శ్రీకృష్ణుడు పవిత్రమైన, మంచి గుణాలను కలిగిన, విదురుడు సమర్పించిన అన్నాన్ని భుజించాడు) అనే విధంగా అతడు సమర్పించిన అన్నాన్ని కోరి భుజించి, తరువాత దుర్యోధనని సభకు వెళ్ళాడు. అక్కడ అతనికి ఎదురుగా వచ్చిన దుర్యోధనుడు, "జ్ఞానంలో గొప్పవాడైన భీష్ముని, జాతిలో గొప్పవాడైన ద్రోణుని, ఐశ్వర్యంలో చాలా గొప్పవాడైన తనను కాదని, వ అన్ని విధాల చాలా తక్కువవాడైన విదురుడు పెట్టిన అన్నాన్ని భుజించి వచ్చాడే! " అనే కోపంతో అధిక్షేపిస్తూ, శ్రీకృష్ణునితో మాట్లాడేటప్పుడు, "భీష్మద్రోణా వతిక్రమ్య మాం చైవ మధుసూదన!, కిమర్థం పుండరీకాక్ష! భుక్తం వృషలభోజనమ్" (భీష్ముని, ద్రోణుని, చివరికి నన్ను కూడా కాదని, పుండరీకాక్షుడవైన ఓ మధుసూదనా! శూద్రుని భోజనాన్ని ఎందుకు భుజించావు?) అని అడిగాడు. దుర్యోధనుడు శ్రీకృష్ణుని అధిక్షేపిస్తూ మాట్లాడే ఈ ప్రకరణంలో అతనికి సంతోషం ఉండదు. ఆ విధంగా అధిక్షేపించేటప్పుడు "మూర్ఖ! మూఢ" అనే విధంగా నిందావచనాలను పురస్కరించుకొని చెప్పవలసి ఉండగా, ఆ విధంగా కాకుండా, " పుండరీకాక్ష! " అని దుర్యోధనుడు సంబోధించాడు. దీనిని రసికులు లోతుగా విమర్శించి చూడాలి. కొత్తగా విమర్శించే శక్తి మనకు ఏమున్నది కనుక! మన పూర్వాచార్యులు విమర్శించి తెలియజేసిన రస్యమైన అర్థాన్ని తెలియజేస్తాను. కోపంతో మాట్లాడినప్పటికీ "పుండరీకాక్ష! " అని సంబోధనను చేసి మాట్లాడడంలో దుర్యోధనుని అభిప్రాయం ఏమి? అంటే, "శ్రీకృష్ణా! నీ అందమైన తిరునేత్రాల కటాక్షాలతో విదురుడు

సకల దురితాలు పోయినవాడై, పరమపరిశుద్ధుడు అయ్యాడు. అందువల్లనే అతని అన్నాన్ని నీవు ఆదరించి భుజించడం యుక్తమైనది" అని తాను తెలుసుకున్న సమాధానాన్ని పారవశ్యంతో చెప్పినవాడు అయ్యాడు. ఇటువంటి గొప్పతనాన్ని కలిగినది— భగవంతుని కటాక్ష వీక్షణం.

ఈ విషయం అటు ఉండనివ్వండి. ఈ శ్లోకానికి సంబంధించి భాసించే ఒక విచారాన్ని కొంచెం విమర్శించి చూద్దాం. "కిమర్థం పుండరీకాక్ష! భుక్తం వృషల భోజనమ్?" అని దుర్యోధనుడు అడిగినదానికి శ్రీకృష్ణుడు ఏమని సమాధానం చెప్పాలి? ఏమి సమాధానం చెప్పాడు? అనే విషయాన్ని చూద్దాం, "వృషలభోజనం కిమర్థం భుక్తమ్" అనేది శ్రీకృష్ణుని మనస్సును గాయపరచే మాట అయినందున, ఆ మాట చెవిని పడగానే చాలా కోపంతో ఎర్రబడిన కన్నులతో " పరమ భాగవతోత్తముడైన విదురుని శూద్రుడని అంటున్నావే! పాపీ! " అని కఠినంగా పలికి, " అతడు శూద్రుడు కాడు, బ్రాహ్మణోత్తముని కంటే ఉన్నతుడుసుమా! " అని సమాధానం చెప్పి ఉండాలి. శ్రీకృష్ణుడు అయితే, ఆ విధంగా సమాధానం పలుక లేదు. విదురుని గూర్చి ఏమీ చెప్పకుండా, " ద్విషదన్నం న భోక్తవ్యం ద్విషంతం నైవ భోజయేత్, పాండవాన్ ద్విషసే రాజన్! మమ ప్రాణా హి పాండవాః" (శత్రువు పెట్టిన అన్నాన్ని తినకూడదు. శత్రువునకు అన్నం పెట్టకూడదు. ఓ రాజా నా పాండవులను నీవు ద్వేషిస్తున్నావు సుమా! వారు నాకు ప్రాణాలుకదా) అని ఇంకొక విధంగా సమాధానం చెప్పినట్లుగా కనబడుతుంది. "శత్రువు దగ్గర అన్నం తినకూడదు. శత్రువునకు భోజనం పెట్టకూడదు. దుర్యోధనా! నీవు నాకు ప్రాణస్థానీయులైన పాండవులను ద్వేషిస్తున్నావు. కనుక, నాకు ద్వేషివి అయినావు. అందుచేత, నేను నీ దగ్గర భుజించకపోవడం మంచిదే"— అని ఈ విధమైన సమాధానాన్ని చెప్పినందున విదురుని గూర్చి దుర్యోధనుడు పలికిన దూషణం శ్రీకృష్ణునకు ఇష్టమే తప్ప, అనిష్టం కాదు— అని కొందరు భావించే అవకాశం ఉన్నది.

శ్రీనిగమాంత మహాదేశికులు రహస్య త్రయసారమనే గ్రంథంలో ప్రభావవ్యవస్థాధికారంలో ఈ విధంగా అన్నారు. అక్కడ ఉండే పంక్తులను గమనించండి.

"దుర్యోధనుడు "భీష్మద్రోణౌ అతిక్రమ్య భుక్తం వృషలభోజనమ్?" అని ప్రశ్నించగా, " ద్విషంతమ్" అని ఈ విధంగా సమాధానాన్ని చెప్పినందున, శ్రీవిదురుని విషయంలో దుర్యోధనుడు పలికిన జాతివిశేషాన్ని భగవంతుడు అంగీకరించినవాడయ్యాడు" –అని. (దేశికులు అన్నారు) ఆచార్యులారా! "కిమర్థం పుండరీకాక్ష! " అనేదానిలో ఉండే భోగ్యమైన అర్థాన్ని చూశారు. స్వామి దేశికులు "ద్విషంతమ్" అని మొదలైన సూక్తిలోని అర్థాన్ని దర్శించారు. ఈ సందర్భంగా రసికులు లోతుగా గమనించి చూడవలసిన విషయం ఏమంటే, లోకంలో వాదప్రతివాదాలలో సమర్థులైనవారు ప్రతివాదం చేసేటప్పుడు, ఒక వాదానికి అనేక సమాధానాలు చెప్పవలసినప్పటికీ, వాటిలో ఏది చాలా ముఖ్యంగా భావించబడుతున్నదో, దానినే చెప్పి నిలుస్తారు. ప్రకృతంలో విదురుని ఉత్కర్షాపకర్షలు శ్రీకృష్ణునకు ముఖ్యంగా వివక్షితం కాదు. "న శూద్రా భగవద్భక్తాః విప్రాః భాగవతాః స్మృతాః" (భగవద్భక్తులు శూద్రులు కారు, భాగవతులు బ్రాహ్మణులని చెప్పబడుతున్నారు), "కీ మప్యత్రాభిజాయంతే యోగినః సర్వయోనిషు" (ఈ లోకంలో యోగులు అన్ని జాతులలోనూ జన్మిస్తున్నారు) "ప్రత్యక్షితాత్మనాథానాం నైవ చింత్యం కులాదికమ్" (భగవంతుని ప్రత్యక్షం చేసుకున్నవారి విషయంలో కులం మొదలైనవానిని పరిగణించకూడదు) అని మొదలైన పలు ప్రమాణాల వల్ల సిద్ధమైన విషయాన్ని ఇక్కడ కొత్తగా సాధించవలసిన ఆవశ్యకత లేదుకదా. "పుండరీకాక్ష! " అని సంబోధించిన దుర్యోధనునకు అది తెలిసియే ఉన్నది. తనకు ప్రాణసమానులైన భాగవతులకు కీడును తల పెట్టేవారిని తాను, తనకు ద్రోహిగా భావిస్తాడు– అనేదే ఇక్కడ ముఖ్యంగా శ్రీకృష్ణునకు వివక్షితం కనుక, అదే చెప్పబడింది. దీనివల్ల విదురుని విషయంలో దుర్యోధనుడు పలికిన దోషాన్ని శ్రీకృష్ణుడు అంగీకరించినట్లు తేలదు– అని ప్రామాణికుల అభిప్రాయం.

# అద్భుతమైన ఐతిహ్యం

(కాంచీ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారి ద్రావిడవ్యాసం ఆధారంగా)

భగవద్విషయం ఈడువ్యాఖ్యానం, శ్రీవచనభూషణవ్యాఖ్యానం, గురుపరంపరాప్రభావం మొదలైన గ్రంథాలలో గోచరించే ఒక ఐతిహ్యాన్ని ఇక్కడ సంగ్రహంగా ప్రస్తావన చేస్తాను. భగవద్రామానుజుల ఉభయవేదాంత ప్రవచనం జరుగుతూ ఉండగా, "ఆత్మకు జ్ఞానానందాలు, శేషత్వం నిరూపకంగా చెప్పబడినవి కదా. వీటిలో అంతరంగ నిరూపకం ఏది?" అనే ప్రస్తావం ఆ గోష్ఠిలో వచ్చింది. అప్పుడు శ్రీరామానుజులు సర్వజ్ఞులై ఉన్నప్పటికీ, ఈ ప్రశ్నకు సమాధానాన్ని ఆచార్య ముఖంగా వ్యక్తం చేయాలి– అని భావించి, తిరుక్కోట్టియూర్ నంబి దగ్గరకు వెళ్లి, సేవించి దీనికి సమాధానాన్ని తెలుసుకొని రమ్మని కూరత్తాళ్వాన్ ను పంపించారు. వారు కూడా ఆ విధంగానే తిరుక్కోట్టి యూర్ నంబి దగ్గరకు వెళ్లి, ఆరు నెలల కాలం వారిని సేవించి, వేచి ఉండి, " అడియేనుళ్ళాన్ ఉడలుళ్ళాన్" (8–8–2) అనే తిరువాయ్ మొழி పాశుర తునకను సమాధానంగా వారి దగ్గరనుండి పొంది, భగవద్రామానుజుల దగ్గరకు వచ్చి దానిని విన్నపించగా, మహానిధి అయిన ఆ సూక్తిలోని అర్థాన్ని శ్రీరామానుజులు గోష్ఠిలో వివరించారు.

"అడియేన్ "అనే పదం నాలాయిదివ్య ప్రబంధంలో వందల కొలది సంఖ్యలోని సందర్భాలలో కనిపిస్తుంది. నమ్మాళ్వారులు పాశురాలను అనుగ్రహించడం ఆరంభించడంలోనే తిరువిరుత్త ప్రబంధంలోని మొదటి పాశురంలో "అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమే" అని అంటూ "అడియేన్" అనే పదాన్ని పురస్కరించుకునే అనుగ్రహించారు. ఈ విధంగా పలువందల సందర్భాలలో "అడియేన్" అనే పదం ఉన్నా, వాటిని అన్నిటినీ విడిచిపెట్టి, తిరువాయ్ మొழி ప్రబంధంలో ఏదో ఒక మూల ఉండే పాశుర తునకను ఆధారంగా చేసుకుని, నంబి సమాధానాన్ని పలికారు. ఈ పాశురం ఎనిమిదవ శతకంలో ఎనిమిదవ దశకంలో రెండవ పాశురంలో ఉన్నది. అక్కడే, మొదటి పాశురం చివరిలోనే, "ఒరువన్ అడియేనుళ్ళానే" అని ప్రయోగింపబడింది

దానిని విడచిపెట్టి, నంబి తరువాత పాశురాన్నే గ్రహించి సమాధానము చెప్పారు. ఇందులో ఏమి విశేషం ఉన్నది? అనే సంగతి సూక్ష్మబుద్ధులైనవారి సూక్ష్మజ్ఞానానికే గోచరం అవుతుంది. దానిని తెలియజేస్తాను, వినండి. ఏ చోట అయినా "అడియేన్" అనే పదానికి "దేహవిశిష్టుడైన ఆత్మ "అనే అర్థం. ఉదాహరణకు "అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమే" అనే సందర్భాన్ని చూద్దాం. దేహం లేకుండా కేవలం ఆత్మ విన్నపం చేయడం సాధ్యం కాదు కదా. దేహవిశిష్టుడైన ఆత్మకే విజ్ఞాపన చేయడం సాధ్యం అవుతుంది కనుక, ఇక్కడ కేవలం ఆత్మను అర్థంగా గ్రహించడానికి అవకాశం లేదు. " అడియేన్ శిఱియ ఞానత్తన్" (1–5–7) అనే వేరొక సందర్భం గమనిద్దాం. ఇక్కడ "ఞానత్తన్" అని జ్ఞానాన్ని కలిగి ఉండడం చెప్పబడినందున, అది దేహానికి అసంభావితం కనుక, ఆత్మకే సంభావితమైనది కనుక, ఇక్కడ "అడియేన్" అనే పదం కేవలం ఆత్మనే చెప్పేది కావాలి– అని కొందరు భ్రమించవచ్చు. కాని, ఆ విధంగా కాదు. ఇక్కడ కూడా "అడియేన్" అనే పదం దేహవిశిష్టుడైన ఆత్మనే తెలుపుతున్నది. ఎందుకంటే, "కాణ్బాన్ అలత్తువన్" అనే క్రియలో ఆ పదం అన్వయించాలికదా. కేవలం ఆత్మయే "అడియేన్" అనే పదానికి అర్థం అయితే అన్వయించదు. ఈ విధంగా, ఎక్కడైనా, దేహవిశిష్టుడైన ఆత్మనే "అడియేన్" అనే పదం చెబుతుంది –అని స్పష్టపడుతున్నది. "ఒణ్ శంగదైవాళాళియాన్ ఒరువన్ అడియేనుళ్ళానే" (అందమైన పాంచజన్యశంఖం, గద, ఖడ్గం, సుదర్శనం అనే వీటిని కలిగిన అద్వితీయుడైన పరమాత్మ నాలో వేంచేసి ఉన్నాడు) అనే చోట కూడా ఆ విధంగానే భావించాలి.

ఇక, " అడియేన్ ఉళ్ళాన్ ఉడలుళ్ళాన్" అనే చోట మాత్రం "అడియేన్" అనే పదానికి కేవలం ఆత్మనే అర్థంగా చెప్పవలసిన నిర్బంధం ఉన్నది. ఆత్మకు విశేషణభూతమైన దేహానికి వాచకమైన "ఉడల్" (దేహం) అనేది ఇక్కడ స్పష్టంగా ఉన్నందున, "అడియేన్" అనే పదంలో దేహాన్ని చేర్చి, అర్థం చెప్పవలసిన ఆవశ్యకత ఇక్కడ లేదు. భగవంతుడు జీవాత్మలోను, అచేతనవస్తువులోనూ అనుప్రవేశించి ఉంటాడు– అని చెప్పడమే ఇక్కడ వివక్షితం. "ఉడలుళ్ళాన్" అని అన్నందున "జడవస్తువును అనుప్రవేశించి ఉండేవాడు" అని చెప్పబడినట్లయినది. "జీవాత్మను

అనుప్రవేశించి ఉండేవాడు"– అనే వివక్షితమైన అర్థానికి " అడియేనుళ్ళాన్" అని ఇక్కడ పదప్రయోగం చేయబడింది. ఆత్మ అహమర్థం కనుక, నిజానికి ఇక్కడ "ఎన్నుళ్ళాన్" అని ఆళ్వార్లు ఇక్కడ చెప్పి ఉండవచ్చు. ఆ విధంగా చెప్పినప్పటికీ "ఆత్మలో ఉన్నాడు"– అనే అర్థం వస్తుంది. అయితే, ఆళ్వార్లు ఆ విధంగా చెప్పకుండా, "అడియేనుళ్ళాన్" అని పల్కినందున "ఆత్మ" అని, " అడియేన్" అనే పదాలు పర్యాయాలు, అంటే, ఆత్మకు శేషత్వమే అంతరంగనిరూపకం– అని ఆళ్వార్లు అభిప్రాయంగా ఇక్కడ మనం అర్థం చేసికోవలసి ఉన్నది.

"ఈ విధంగా భగవద్రామానుజులు నిర్ణయించినట్లుగా చెప్పే ఐతిహ్యం వాస్తవమై ఉండాలి అంటే, ఇది శ్రీభాష్యకారుల దివ్యసూక్తులలో ఎక్కడైనా ఒకచోట ప్రస్తావించబడి ఉండాలి. లేకపోతే, ఈ ఐతిహ్యానికి గౌరవం లేదు. శ్రీభాష్యంలో "జ్ఞోఽత ఏవ" అనే సూత్రంలోని వివరణలో ఇది తెలుపబడలేదు. అక్కడ "అయమాత్మా జ్ఞాతృస్వరూప ఏవ" అని ఇంత మాత్రమే నిర్ణయంగా తెలుపబడింది. అందుచేత పైన వివరించిన ఐతిహ్యం యథార్థమై ఉండే అవకాశం లేదు" –అని ఈ విధంగా గురుకులవాసభాగ్యం లేనివారు కొందరు చెప్పవచ్చు. వారిని చూచి, "ఎణ్ణాద మానిడత్తై ఎణ్ణా పోదెల్లామ్ ఇనియవాఱే" (భగవన్నామాన్ని స్మరించనివారిని స్మరించని సమయం అంతా నాకు చాలా మధురంగా ఉంటుంది, అంటే, అటువంటివారిని స్మరించక పోవడమే మంచిది– అని తాత్పర్యం) అనే విధంగా విడచిపెట్టి, తత్వజిజ్ఞాసువులైన సుకృతులకు మర్మాన్ని ఇక్కడ తెలియజేస్తాను. ఈ మహార్థం భగవద్రామానుజులు మనస్సులో చక్కగా ఊరి, నిలచినందువల్లనే, వారి గీతాభాష్యంలో తగిన చోట ఇది వ్యక్తం చేయబడింది. "చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున! ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ" (7–16) అని గీతలో చెప్పిన సందర్భంగా గమనించి, తరువాత, శ్రీరామానుజుల భాష్యాన్ని గమనించండి. "జ్ఞానీ– విశేషణ తత్వవిత్" అని మాత్రం అన్నారు, శంకరాచార్యులవారు. మన స్వామి భగవద్రామానుజులు మాత్రం ఆ అర్థాన్ని ఆదరించకుండా, "భగవచ్ఛేషైకరసాత్మ స్వరూపవిత్ జ్ఞానీ" అని అనుగ్రహించారు. ఈ

విధంగా ఒకచోట కాదు జ్ఞాని అనే వచ్చే సందర్భాలలో అంతట ఈ విధంగానే వారు అనుగ్రహించారు. "జీవాత్మయొక్క జ్ఞానానికి ప్రయోజనం తన శేషత్వాన్ని తెలియడమే"— అని శ్రీరామానుజుల అభిప్రాయం— అని ఇక్కడ శ్రీరామానుజులు చేసిన ఈ వివరణ వల్ల స్పష్టపడుతున్నది. ఆళ్వార్ల సూక్తులలో అవగాహనం లేకుండా ఇటువంటి వివరణను అనుగ్రహించడం సాధ్యం కాదు.